## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2030020025523

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వైద్యరహస్యదీపిక.



అను

## కాలజ్ఞానము.

(సతాత్పర్యపద్యకావ్యము.)

(సంస్కృత కాలజ్ఞానమునుండి తెనిగింపఁబడినది.)

గ్రంథకర్త.

దేవినేని సూరయ్యగారు



Reprint 1000 ప్రతులు.

ప్రకాశకుఁడు

కురుకూరి సుబ్బారావు

సరస్వతీబుక్‌డిపో

బెజవాడ

కృష్ణాజిల్లా.

1932



వెల రు 0—8—0

# విషయసూచిక.



శ్రీ

కృష్ణగురుపరబ్రహ్మణే నమః.

# వైద్యరహస్యదీపిక.

అను

కాలక్షేపము.

## ఇష్టదేవతాభివందనము.

ఉ. శ్రీకామరారువక్షమునఁ జేరి మృదూక్తులగౌరవింప ద
ర్వీకరనాయకోపరిఁ బ్రిపిణతఁ జేరి నిరంతరాశ్రితా
నీకమనోప్సితార్థము లనేకవిధంబులఁ దీర్చుకృష్ణుఁడ
స్తోకదయార్ద్రమానసముతో నిడుఁగాత, సమస్తభద్రముల్

తా. లక్ష్మీదేవి తనవక్షస్థలమున వసించి, మృదువైనశృంగార సంభాషణములచే, తన్నానందింపజేయ, ఆదిశేషునిపైఁ బవళించి, ఎల్లప్పుడును, తన్నాశ్రయించియుండు భక్తులకోరికల ననేకరీతులఁగాఁ దీర్చుకృష్ణమూర్తి- దయతోఁగూడిన మనస్సుగలవాఁడై-శుభముల నొసంగునుగాత !

ఉ. శ్రీధరుఁడై సమస్తసురశేఖరులన్ కరుణించి మించి గం
గాధరుఁడై భగీరథుని గౌరవమొప్పఁగనాదరించి గౌ
రీధరుఁడై సతీపతులరీతి జనాలికి వెల్లడించునా
గ్గాధరుఁడైన శంకరుఁడఖండ శుభంబులొసంగుఁ గావుతన్

తాత్పర్యము:—సర్పములుగలవాఁడై దేవతలను దయతోఁ జూచి, గంగను ధరించినవాఁడై భగీరథుని గౌరవముతో నాదరించి, అర్ధశరీరమందున పార్వతిని ధరించినవాఁడై లోకమున, భార్యాభర్తలిట్లు, కలసి యుండవలెనని బోధించు శంకరుఁడు మతిలేనిశుభము లిచ్చుఁగాక !

చ. కమలదళాక్షునాభి నవకంజమునన్ జనియించి సర్వలో
కములు సృజించుచున్ మదిని గౌతుక మెక్కువపల్లవింప సం
భ్రమమున వీణమీటునల భారతిదేవినిఁగూడి సత్యలో
కమునవసించు నాలుమొగంబుల దేవుఁడొసంగు నాయువుల్. 3

తాత్పర్యము:—విష్ణుదేవుని బొడ్డునందున్న తామరపూవునందు జన్మించి జగములను పుట్టించుచు మనస్సు సంతోషించునట్లుగా వీణావాయించఁగల సరస్వతీదేవిని గలసి సత్యలోకమునందుండు నాల్గు మొగంబులుగల బ్రహ్మదేవుఁడు ఆయుష్యము నిచ్చుగాక.

చ. కనదనుకంబునన్ విధిముఖప్రతి హారమునన్ వసించి వా
నినిఁ జతురాస్యుఁగాఁ జలిపి, నిస్తులకీర్తి వహించినట్టి వా
గ్వనరుహనేత్ర మామకముఖప్రతి హారమునన్వసించి, న
న్ననుపమసత్కృపా కలితయై చతురాస్యునిఁగా నొనర్చుతన్. 4

తాత్పర్యము: —బ్రహ్మదేవుని నోటియందు నివాసముచేసి యాతనిని విద్యాసమన్వితునిగా గావించి గొప్పకీర్తినిగొన్న సరస్వతి నాజిహ్వాగ్రమందు సయితము వసించి నన్నును, చతురవిద్యాసమన్వితునిఁగాఁ జేయునుఁగాక !

ఉ. వీరచియింపఁగాఁ గడఁగునీకృతికెత్తట నెట్టి విఘ్నముల్
జేరఁగనీక యాశ్యాలు విశేషముగానుతి మెచ్చునట్లుగా
బూరితిఁజేతు వంచుఁ బరిపూర్ణతరంబగు భక్తినిపదాం
భోరుహయుగ్మమాత్మమును మ్రుక్కుగఁ గొల్చెదనో వినాయకా. 5

తాత్పర్యము:—ఓవిఘ్నేశ్వరా నేను వ్రాయఁదలఁచినయీ గ్రంథమున కెప్పుడును ఎటువంటి యాటంకమును రానీయక పెద్దలు మనస్సులందధికముగా మెచ్చుకొనునట్లుగా దీనిని సంపూర్ణము చేయుదువని భక్తితో నీపాదపద్మములను ముందుగా కొల్చుచున్నాను.

గీ. విబుధులకును, నాయుర్వేదవిదులకును సు
కవులకును మఱిజ్ఞానపుంగవులకును స
మస్తశాస్త్రవేత్తలకు నమస్కృతులు
వినయమునఁగ నాచరింతు నేవేడ్కఁ గలర 6

తాత్పర్యము:—సజ్జనులకును, ఆయుర్వేదము తెలిసినవారికిని ఉత్తములగు కవీశ్వరులకును, జ్ఞానులగువారికిని, అన్నిశాస్త్రములును తెలిసినవారికిని, వినయముతో నమస్కరించుచున్నాను.

ఉ. ధీమణులాత్మలో ననుమతింపఁగజాలిన సత్కవిత్వమే
నేమహనీయుఁ జేర్చి రచియింపఁగఁ గల్గితినో తలంప ని
ష్ఠామహనీయుఁ గృష్ణగురునంఘ్రి సరోజయుగంబు నాత్మలో
నేమఱకుండఁగొల్చెద నహీనతరంబగు భక్తిమీఁగన్. 7

తాత్పర్యము:—పండితులు సమ్మతింపదగిన సత్కవిత్వమును నే నేమహాత్ముని దయచే రచింపశక్తిగలవాఁడనైతినో ఆ మహాత్ముఁడగు, శ్రీకృష్ణగురుస్వామి పాదపద్మములను నే నిప్పుడు ఏమరుపాటు లేకుండ తక్కువగాని భక్తితో మనస్సునఁగొల్చెదను.

గీ. వసుధదేవినే వేంకటస్వామికిని సు
సాధ్విపిచ్చమాంబకు నగ్రసంభవుండ
కృష్ణగురుసేవ సతతమొనరించువాఁడ
నార్యజనవిధేయుఁడ సూరయాహ్వయుండ 8

తాత్పర్యము — నేను దేవినేని వేంకటస్వామికిని, పతివ్రతయగు పిచ్చమ్మకును పెద్దకుమారుఁడును, ఎల్లప్పుడును కృష్ణగురునకు సేవ

చేయువాఁడను, సూరయ్యయను పేరుగలవాఁడను. సజ్జనులకు హితే యుఁడనగు వాఁడను.

వ. అగు నేనిట్లిష్టదేవతాభివందనంబుఁ గావించి, సర్వజనోప యోగంబుగా నొక్క చిన్ని పొత్తమ్ము రచింపఁ నుద్యోగించు చున్నంత— 9

తాత్పర్యము -- సులభము.

శా. శ్రీచిత్తప్రియుపాదపద్మయుగసంసేవానురక్తుండు సా
మీచీన్యముల వైద్యశాస్త్రనిపుణామేయప్రభావార్జిత
ప్రాచుర్యోన్నత కీర్తివైభవుఁడు నారంజిల్లుముత్తైవిశే
షాచార్యుం డొకనాఁడు నన్నుఁగని హర్షంబారఁగా నిట్లనెన్ 10

తాత్పర్యము—శ్రీవిష్ణుపాదసేవయందు ప్రీతిగలవాఁడును, పూర్వపవిత్రవైద్యశాస్త్రనైపుణ్యసామర్థ్యప్రతిభచేత గణించిన గొప్పకీర్తివైభవము గలవాఁడును, నైన ముత్తైవిశేషాచార్యుఁడొకదినమున నన్నుఁజూచి సంతోషముతో నిట్లనియెను.

క. కవివర! నీవురచించిన
ప్రవిమలతరగ్రంథములనుఁ బరికింపఁగ నా
కవిరళమగు సంతోషమొ
దవె మఱియిపుడాత్మ నొక్కతలపుం గలిగెన్. 11

తాత్పర్యము—ఓకవీశ్వరా! నీవువ్రాసిన దోషములేని గ్రంథములను చూడఁగా నాకమితమగు సంతోషమును, ఇప్పుడొక యాలోచనయుఁ గల్గుచున్నది.

వ. అదెద్దియన— 12

క. కాలజ్ఞానము బ్రజ్ఞా
శీలుఁడవై యాంధ్రమున రచించితివేనిన్
మేలుగలుగుఁ గావున నను
కూలముగ రచింపుమెల్ల కోవిదులెన్నన్. 13

తాత్పర్యము— సమర్థుఁడవయ్యు కాలజ్ఞానమను గ్రంథమును తెలుఁగుభాషయందు వ్రాసినట్లయిన ఉపయోగకరమై యుండును గావున అనుకూలముగ పండితులు మెచ్చునట్లు రచింపుము.

వ. అని యుల్లాదరణ పూర్వకముగా నానతిచ్చిన యమ్మహానీ యుంగాంచి యే నిట్లంటి— 14

తాత్ప—సులభము.

క. శక్తికొలది తెనిగింతు; స
భక్తిగఁ గృష్ణునిఁ దలంచి ప్రజలెల్లరునా
సక్తిఁగలిగి చదువుట క
న్వొక్తులతో నొప్పునట్టు లూహించి మదిన్ 15

తాత్ప—భక్తితో కృష్ణగురుని తలఁచుకొని ప్రీతితో జనులందఱును చదువుటకు తగిన పలుకుల నూహించి నాశక్తికొలది తెలుఁగున రచించెదను.

వ. మఱియు, 16

క. ఏనిపుడు వ్రాయు గాల
జ్ఞానము శ్రీకృష్ణగురువునకు నఁకితమీఁ
గా నాత్మఁ బూనియుంటి; ద
యానిధి యగు నతఁడు పాసనాపరుఁ డగుటన్ 17

తాత్ప—నేనిప్పుడు రచింపఁదలచిన కాలజ్ఞానగ్రంథమును, దయానిధియైన కృష్ణగురువు ఉపాసనాపరుడగుటవలన అతని కంకితము చేయుటకు మనస్సున నూహించితిని.

వ. అన్నంత నమ్మహానీయుఁ డత్యంతసంతుష్టాంతరంగుఁడై నీయుద్యమంబు నిర్విఘ్నంబుగా నెఱవేరుఁగాత యని యాశీర్వదించుటయు నామీఁదఁ జేసెడు కార్యంబు సాంగంబుగా ఁ ముట వెయ్యకు కర్తవ్యమునితలంచి ప్రారంభంబునకు బారకొంటి నెట్టులనిన 18



శ్రీ

కృష్ణగురు పరబ్రహ్మణే నమః

# వైద్యరహస్యదీపిక.

అను

## కాలజ్ఞానము.

క. శ్రీరాధాహృదయేశ్వర!
ధీరజన భయాపహార! దివ్యవిచారా!
కారుణ్యాకర! భువనా
ధారా! రోచిష్ణ! ధృతకుధర! శ్రీకృష్ణా! 1

తాత్పర్యము—ఓ రాధామనోనాధా!— ధీరులగువారి భయముదీర్చు వాఁడా! యోచన గలవాఁడా! దయతోఁ గూడినవాఁడా! జగముల కాధారమగు వాఁడా! కాంతితో వెల్గువాఁడా! కొండనెత్తినవాఁడా! కృష్ణా:—

క. మును, శివుని చేతఁజెప్పఁబ
డిన కాలజ్ఞానమునకుటిలత తరబుద్ధిన్
దెను గుంజేసెద; నీపే
ర్మిని, బుధాధృతిని నవధరింపుము; కృష్ణా! 2

తాత్పర్యము—ఓకృష్ణా! పూర్వము శంకరునిచేఁ జెప్పబడిన కాలజ్ఞానమును దాపరికము లేకుండ నీపేరుమీఁద, తెలుఁగు భాషలో చెప్పుచున్నాను; ఆలకింపుము.

—కాలమునకు సృష్టిస్థితిసంహార కర్తృత్వము—

గీ. బ్రహ్మసృష్టిని, విష్ణువు పాల నంబు
హరుఁడు సంహారమునుఁ జేయుటరసి చూడఁ
గాలమును బట్టియేకాన కాలమెల్ల
కార్యములకుఁ గారణమగుగాదె! కృష్ణ 3

తాత్పర్యము—ఓకృష్ణ! బ్రహ్మదేవుఁడు పుట్టించుటయుం విష్ణువు పెంచుటయు, శివుఁడు నశింపఁ జేయుటయు, కాలమునననుసరించియే. కనుక అన్నిపనులకును కాలమే కారణమై యున్నది.

గీ. ఏవిబుధులు కాలజ్ఞాల మెఱిఁగియుందు
రానిపుణులు వ్యాధిగ్రస్తు లనుభవింప
నున్న భావిపణ్మాస మృత్యువునుఁగూడఁ
దెలసికొనఁ గల్గుదురు వింత గలుగ కృష్ణ! 4

తాత్పర్యము—కాలజ్ఞానము నెఱిగిన బుద్ధిమంతులు రాబోవువారు నెలలలోపల వ్యాధిగ్రస్తులకు రాబోవు చావును అద్భుతముగా తెలిసికొనఁగల్గు చున్నారు.

క. కాలమె సృష్టికిమూలము
కాలమె సంహారమునకు గారణ మగు ని
క్కాలమె నిద్రాదులకా
వాలమగుట దానిదెలియఁగ వలయునుకృష్ణా! 5

తాత్పర్యము—ఓకృష్ణా! పుట్టుకకును చావునకును నిద్రాదులకును కాలమె కారణము కనుక దానిని తెలిసికొనవలయును.

గీ. దేవతలు నాగులును పూర్వదేవతలును
యక్షులును సర్పములును విద్యాధరులును
మనుజులాదిగా గల ప్రాణులును నశింప
గలుగుటకును గాలమ్మె ముఖ్యమగు కృష్ణా! 6

తాత్పర్యము—ఓకృష్ణా! దేవతలు, నాగులు, రాక్షసులు, యక్షులు, సర్పములు, విద్యాధరులు, మనుష్యులు మొదలైన ప్రాణు లన్నియు నాశనమగుటకు కాలమే కారణము.

క. అరవిందాసను, నాయుః
పరమితిలో నర్ధమందుఁ బదునల్వురు, ని
ర్జరనాథులు శతవత్సర
పరిపూర్తినతండు గాలవశుఁడౌ కృష్ణ!

తాత్పర్యము—ఓకృష్ణ ! బ్రహ్మచే నిర్ణయింపబడిన ఆయువు నందు సగభాగమున పదునల్వురు దేవేంద్రు లుందురు. 100 వర్షము లుపూర్ణమైన పిదప నాతఁడు మరణించును

గీ॥ మనుజసంతతి కాయుః ప్రమాణమాగ
మమ్ములందున శతవత్సరమ్ము లంచుఁ
జెప్పఁబడెఁగాని దుష్కృతుల్ సేత నూరు
నిండకమునుపె నశియించు చుండె; కృష్ణ!

తాత్పర్యము—ఓకృష్ణ! మనుష్యులకు గల వయఃప్రిమాణము నూరు సంవత్సరములని వేదములందు గలదు కాని, చేయు దుష్కార్యముల చేత, ఆ పరిమిత నిండకమున్నే మనుష్యుడు మరణించుచున్నాడు

గీ. పృధివిలో వృష్టి శీతము గ్రీష్మము నుద
యమ్ము నపరాహ్ణమింక సాయంసమయము
రాత్రియును నివిమెల్ల గాలస్వరూప
ములను చాత్మలోఁ దెలియంగ వలయుఁ గృష్ణ!

తాత్పర్యము—ఓకృష్ణ! భూమియందు, వర్షము, చలి, వేడిమి, ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రి ఇవియన్నియును, కాలము యొక్క స్వరూపములని తెలిసికొన వలయును.

గీ. తరువులు ఫలించుటకు ని
ద్ధరబీజము లంకురించి, తనరుటకును, క
న్య రజస్వలయగుటకు, మది
నరయఁగ కాలంబు మూలమగునో కృష్ణా. 10

తా. ఓకృష్ణా ! చెట్లు ఫలించుటకును, విత్తనములు మొలుచుటకును కన్యక సమర్తయగుటకును, ఆలోచించిచూడఁగా కాలమే కారణమగును.

గీ॥ సాదమును, నుదకమ్ము వర్షమ్ముగూడ,
గాలమునఁ గల్గుఁగాన, నిక్కాలము నెపు
డనుసరించి పనులుసేయ, నగుశుభంబు
లేనిచో నశుభంబుఁ గల్పించు, కృష్ణ! 11

తా॥ ఓకృష్ణ ! అన్నమును, నీరును, వర్షమును, కాలమువల్ల కల్గును; గనుక, ఈకాలము ననుసరించి పనులుచేసినచో మేలుగల్గును. లేనియెడల కీడు గల్గును.

గీ॥ కాలమను నగ్నియుండు; హృద్గోళమందు
దానిచే క్షుత్పిపాస నిద్రాభిలాష
లనెడు నాలుగు నుద్భవమగుచునుండు ! 12
గాలమునుఁజెందదియుఁగాదు కృష్ణ !

తా॥ ఓ కృష్ణ ! హృదయమను బంతియందు కాలమను నిప్పుండును. దాని వలన, ఆకలి, దప్పి, నిద్ర, కోరిక అను నాల్గును పుట్టును. కాలములేక, ఏదియును గానేరదు.

—♦ కాలపురుష ప్రభావము ♦—

మ॥ నరవామాయ,జగత్కటాహమునఁబ్రాణివ్రాతముల్, కాలమన్
పురుషుండుంచి,దివాని శేంధనములం బూషాగ్నిముట్టించి, మా
నభుతుఃకంబుల తోడఁద్రిప్పుచు, మహాశ్చర్యంబుఁగాఁ బ్రేల్చు, నా
పురుషుంగాంచినచోఁ ద్రికాలఫలితంబుల్ దెల్లనా మాధవా! 13

తా॥ లక్ష్మీనాథుఁడవగు నో కృష్ణ! కాలపురుషుఁడీ జగత్కటాహమున, ప్రాణిసమూహము నుంచి, రాత్రింబవళ్ళను కట్టెలను సూర్యుఁడను నిప్పునకు ముట్టించి, మాసములు, ఋతువులతో ద్రిప్పుచు, మిగుల నాశ్చర్యముగా ద్రేల్చు నాపురుషుని గన్గొన్నచో. త్రికాలఫలములును తేటతెల్లమగును.

గీ॥ అఖిల విషయంబులకు మూలమగుచు, సకల,
భూతకోటి శుభాశుభమ్ములకు హేతు
వయి, ముదమ్ము, విస్మయమ్ము నొసఁగుఁ
గాలపురుషుని వర్ణింపఁ గలమె? కృష్ణ!

తా. అన్ని వ్యవహారములకును, మూలమై అన్ని జీవముల యొక్క మంచిచెడ్డలకును, కారణమై భయమును, సంతోషమును, ఆశ్చర్యమును గలిగించు కాలపురుషుని, ఓ శ్రీకృష్ణ! నేను వర్ణింపఁ గలనా!

గీ॥ దినదినము ననంత భూతనికరంబు,
గాలవశమౌచునుండుటఁ గన్నులారఁ
గనుఁగొనుచుఁ దామశాశ్వతమను తలంపు
గలిగి నరులు మెలంగు టక్కజము కృష్ణ!

తా॥ కృష్ణ! ప్రతిదినమును లెక్కలేని ప్రాణులు మరణించుచుండుటను కండ్లారఁ జూచుచు, మనుష్యులు తాము నశింపనివారము నుకొనుట మిక్కిలి యాశ్చర్యకరము సుమా!

## —॥ శరీరాధార యంత్రము ॥—

గీ॥ ఆరుచక్రము ల్షోడశాధారములు, త్రి
లక్ష్యములు, గాక మఱియు సల్లలితగగన
పంచకంబాత్మ దేహమందుండు దీనిఁ
దెలియ, నవి యెఱుఁగక వైద్యుఁడగునె? కృష్ణ! 16

తా॥ ఓ కృష్ణా! శరీరమునందు, ఆరు చక్రములు, పదునారు ఆధారములు, మూడులక్ష్యములు, ఐదు ఆకాశములు, నుండును. దీనిని తెలిసికొన లేనివాఁడు వైద్యుఁడెట్లగును?

—♦ షట్చక్రములు ♦—

గీ॥ బ్రహ్మ, లింగ, నాభి, భవ్యహృత్కంఠ భూ
మధ్యపదవులన్ క్రమంబుగా బ
దాఖ్యలం జెలంగు నారు చక్రములు, త
ద్విదుఁడె వైద్యుఁ డగుచు వెలయుఁ గృష్ణ॥ 17

తా॥ కృష్ణ బ్రహ్మ, లింగ, నాభి, హృదయము, కంఠము, భ్రూమధ్యము ఈ ప్రదేశములయందు, ఆపేర్లతోడనే, ఆరుచక్రము లుండును. దీని నెఱిఁగినవాఁడే వైద్యుఁడు.

——♦ మతాంతరము ♦——

గీ॥ ధరఁగవాటము, జ్యోతి, హృదయము, నాభి
నాసికము, గుదమనుచుఁ గొందఱువచింతు
రనుభవమున నీ చక్రములనుఁ గ్రమముగఁ
గనుఁగొనకయెప్డు వైద్యుఁడుగాఁడు కృష్ణ! 18

తా॥ ఓ కృష్ణ! మఱికొందఱు, వీనినే, కవాటము, జ్యోతి హృదయము, నాభి, నాసికము, గుదము అని పల్కుదురు. అనుభవముచేత, దీని నెఱుఁగనివాఁడు వైద్యుఁడు కాఁ జాలఁడు।

—♦ షోడశాధారము ♦—

గీ. క్షితి సహాంకృతిమనోచిత్తబుద్ధులుగా ర
ణమ్ముప్రాణపంచకమ్ము, భూత,
పంచకమ్ము మఱియు, నంచితజ్యోతి రూ
పుఁడగుజీవుఁ డీ వగుదుపుఁ గృష్ణ! 19

తా॥ ఓ కృష్ణ !

—♦ త్రిలక్షములు ♦—

గీ. దౌడలందూర్ధ్వ లక్షము దనరుచుండు
మధ్యలక్షము హృదయపద్మమున నుండు
నాభియందధో లక్షమున్నతిగ నుండు
నా త్రయవిహీనుడే పరమాత్మ కృష్ణ! 20

తా॥ ఓ కృష్ణ ! ఊర్ధ్వలక్షము దౌడలందున, మధ్యమలక్షము, హృదయకమలమందును, అధోలక్షము నాభియందును ఉండును. ఈమూడును లేనివాడే పరమాత్మ యనబరగును.

—♦ వ్యోమపంచకము ♦—

ఉ॥ ధారుణిలో, నహంకృతియె స్తంభముగా జెలువొందనానవ,
ద్వారపరీతదేహపరధామమునన్, గుణ శూన్యతాచు నిం
పారగ; బంచదేవతలు, పంచహృషీక కుటుంబవర్గమం
దేరికి జిక్కకుండు నవియే, నభపంచకమౌర మాధవా?! 21

తా॥ ఓ కృష్ణ ? అహంకారమే స్తంభమై యొప్పగా తొమ్మిదిద్వారములుగల ఈదేహమున, పంచదేవతలు నిర్గుణులై యొప్పగా పంచహృషీక కుటుంబమునం దెవ్వరికి పట్టుబడకుండ నుండుము. ఇవియే నభపంచకమునం బడును.

—♦ అవాంతర స్తంభము ♦—

గీ॥ నృవితతికి, బ్రాహ్మణవాయువు రేబవళ్లు,
నరయుగానిర్వ దొక్కవేయారు నూరు
సారులాడు దన్నియమ సంచారమే, న
రస్థితికిమూలమగుట దిరంబు కృష్ణా! 22

తాత్పర్యము — కృష్ణా ! మనుష్యులకు రాత్రింబవళ్లు కలిసి, ప్రాణవాయువు, ఇరువదియొక్కవేయి ఆరువందలసార్లు ఆడుచుండును. ఈ సంచారమే మనుష్యులు బ్రతుకుటకు కారణము.

### — పంచతత్త్వవివరణము —

గీ. ఆత్మ యంతరాత్మయుఁ బరమాత్మ యనఁగ
దనువు మనసు ప్రాణములకుఁ దనరుఁ బేళ్లు
పంచతత్త్వమ్ముల౯ ధరియించి యాత్రి
యమ్ముఁబొలుపొందుచుండునో యనఘ ! కృష్ణా! 23

తాత్ప—శరీరము, మనస్సు, ప్రాణము అను మూటికిని, ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ యనుపేళ్లు గలవు. ఈమూడును, పంచతత్త్వములను ధరించియుండును.

### — సూర్యోదయమతము —

చ. తనువనుపట్టణంబున యథావిధి వాయుభటుండు లోనికి౯
జనుసమయంబునందున దశాంగుళముల్బైటకేగుచో
నొనరగ ద్వాదశాంగుళములుండుఁ బ్రమాణము దీనికెప్పుడై
నను వ్యతిరేకమైన మరణంబునకు౯ గతమౌగ మాధవా. 24

తాత్ప—ఈశరీరమను పట్టణమునందు యథావిధిగా వాయువను భటుఁడు లోపలికేగు సమయమున పదియంగుళములు బయటకుపోయినయెడల పండ్రెండంగుళముల ప్రమాణముండును. ఎప్పుడైన నిందులకు వ్యతిరేకముగా జరిగినట్లయితే మృత్యువును గ్రహింపవలెను.

### — సూర్యచంద్రనాడుల యుదయాస్తమయ ఫలము —

గీ॥ పురుషుని యుచ్ఛ్వాస నిశ్వాసము లుదయించు
నపుడు సూర్యనాడిని యుదయంబు చెంది
చంద్రనాడిని నాటియుండ సౌఖ్యమొదవు
నట్లు గానిచో మరణ చిహ్నంబు కృష్ణ ! 25

తాత్ప—ఉచ్ఛ్వాసనిశ్వాసములను విడుచు సమయమున సూర్యనాడియందుదయమై చంద్రనాడియం దంతమైనచో శుభముగల్గును. అట్లు కానియెడల మరణమును గ్రహించుకొనవలెను.

—॥ ఒకపక్షమునఁ గల్గు మృత్యుజ్ఞానము ॥—

క. రవినాడి పూర్ణముగ వా
యువుపూరితముగుచుఁ జెలఁగుచుండఁ గుముదబాం
ధవునాడి వాయురహితం
బవు నెడఁ బక్షమునకంతమునంతము కృష్ణ. 26

తాత్ప -- సూర్యనాడియందు పూర్తిగా గాలినిండి యాడుచున్నప్పుడు చంద్రనాడియందు గాలిలేనిచో ఒకపక్షమున మృతిగల్గును.

—శీఘ్రమృత్యుజ్ఞానము—

గీ. ప్రాణిశ్వాస యెత్తులో నొక రంధ్రమందు
నిలచి నెలగాని లేకారు నెలలు గాని
మూడు నైదు బదేనుదినమ్ములు క్రమముగఁ
గానియాడిన మరణంబుగల్గు కృష్ణ. 27

తాత్ప—ఓకృష్ణ! ప్రాణుల శ్వాస ఎప్పుడైనను ఒకే నాడియందు నెలగాని, ఆరునెలలుగాని, పదునైదుదినములుగాని, నిలిచిపోయినయెడల శీఘ్రమృత్యువు గల్గును.

—చంద్రసూర్యగమనక్రమము—

గీ. చంద్రనాడెపుడు శుక్లపక్షమున సూర్య
నాడి కృష్ణపక్షమున నాడుచో సు
ఖంబొదవు లేక యొక్క-పక్షమున రెండు
మూఁడుదినములు గతిదప్ప ముప్పుకృష్ణ 28

తాత్ప - ఎప్పుడును చంద్రనాడి శుక్లపక్షమునందును, సూర్యనాడి, కృష్ణపక్షమునందున, ఉదయించియున శుభముగల్గును. అట్లుగాక ఒక్కపక్షములోనే రెండు మూడుదినములు గతులు మారునెడల మృతిగల్గును.

—పంచభూతాత్మక దీపరక్షణము—

గీ. పాంచభౌతిక మనెడు దీపమ్ము చంద్రుఁ
డనెడు తైలము గ్రహించి సూర్యానిలమున
నాఱిపోకుండఁ జూచునట్లయినఁ గాంతి
గలిగి వెలుఁగుచునుండు నిక్కముగ కృష్ణ. 29

తాత్ప—ఓకృష్ణ ! పాంచభౌతికమను దీపము చంద్రుఁడనెడు నూనెతో సూర్యుఁడనుగాలివలన ఆరకుండ జూచుకొన్నట్లయిన ప్రకాశముగ వెలుగుచుండును.

చ. అనువుగ నాత్మదీపము దివాకర వత్తినిఁ గల్గి యాయువన్
ఘనతర తైలయుక్తమయి కాలుచు మేనను మల్లకంబునం
దునఁదగు నిత్యసంస్కృతి గనుంగొనఁ బ్రాణియొక వర్తనంబె యీ
తనువునకొప్పు రేఖ యగు తథ్యముగా వినుఁగొన మాధవా! 30

తాత్ప--ఆత్మయను దీపము. సూర్యుడను వత్తినిగలిగి, ఆయుష్యమను నూనెతోఁగూడి, శరీరమును ప్రమిదెయందు వెలుగును. ఈ సంస్కృతినిచూడగా ప్రాణియొక్క వర్తనమె శరీరమునకు రేఖగా నొప్పును.

—ఆయుర్హీన లక్షణము—

గీ. ఇల నరుంధతీ ధ్రువతారకను, దార
కాత్రయముఁ గల శ్రవణ నక్షత్రమును స
మంచితం బగు మాతృకామండలంబు
గనఁ బడకయున్న మరణంబు గల్గు కృష్ణ. 31

తాత్ప--అరుంధతీ ధ్రువనక్షత్రములను త్రితారలను గల్గిన శ్రవణనక్షత్రమును మాతృకాలమండలమును కన్పడకుండిన యెడల మరణముగల్గును.

— అరుంధత్యాదులకు సంజ్ఞలు —

గీ. జింహా యె యరుంధతియును నాసికమె ధ్రువము
నమరు భ్రూమధ్యమే శ్రవణమును భ్రూయు
గంబెయామాతృ కామండలంబు ; వాని
గననివారు నశింత్రు; నిక్కముగ కృష్ణ. 32

తాత్ప— నాలుకయే అరుంధతి, నాసికయే ధ్రువము, భ్రూమ ధ్యమే శ్రవణము, భ్రూయుగమే మాతృకామండలము ఇవి కాన్పింపనివారు మరణింతురు.

— నీటియందు సూర్య చంద్రబింబ దర్శనము —

చ. కన దినచంద్రబింబములుగాంచినచో నుదకంబునందుఁ దూద
ర్పున మఱిదక్షిణంబున నిరూఢిగఁ బశ్చిమమందు నుత్తరం
బున నెటనేనియుఁ మొఱకబొందిన నాఱును మూఁడు రెండు నొ
క్క నెలలలోఁ గ్రమంబుగ నఁ గాంతురు మృత్యువునోరమాధవా. 33

తాత్ప—సూర్యచంద్రబింబములు నీటిలో కాన్పించునీడల యందు మొఱకగాన్పించినయెడల మృత్యువుగల్గును. అది తూర్పుగా గాన్పించిన ఆఱు నెలలలోను, దక్షిణముగాగాన్పించిన మూఁడు నెలల లోను, పడమట గాన్పించిన రెండు నెలలలోను, ఉత్తరమునఁ గాన్పించినచో ఒక నెలలోను మృత్యువుగల్గును.

క. అగణితముగ రవిచంద్రులు
పొగచేఁ గ్రమ్మఁబడినటుల బొడము నెవరికి
జగమున నవ్వారద్భుత
ముగనప్పుడ కాంతుమరణమును శ్రీకృష్ణ. 34

తాత్ప—సూర్యచంద్రులు పొగచే గ్రమ్మబడినట్లు గాన్పించినవారు అద్భుతముగా వెంటనేమరణింతురు.

—। మరణమునందరిష్టమునకు ముఖ్యత్వము ।—

గీ. ఫలముగల్గుట కాది పుష్పంబు వొడముఁ
రీతి మృతిగల్గుటకు ముందరిష్టమనెడు
లింగమొకటి గన్పట్టు నాలింగవిషయ
మంత వివరింతు నీదుప్రియమునఁ గృష్ణ. 35

తాత్ప—ఫలము కల్గుటకు ముందుగా పూవెట్లుపుట్టునో అట్లే మరణముగల్గుటకు ముందుగా అరిష్టమను లింగము కాన్పించును. ఓ కృష్ణ! నీకు ప్రియమగున ట్లదియంతయును వివరించెదను.

చ॥ అరయఁగఁ జెట్టునం బొడము నట్టి ప్రసూనము లన్నికాయలై
పోరయని యట్లరిష్టములు, బూణముగాఁ గనుపట్టి యుండినన్
మరణము దప్పు; మేడి, యనుమాత్రినిలఁ బూవక కాచినట్లుతే
కరణి నరిష్టముల్గలుగగ మానదరిష్టము గల్గు మాధవా 36

తాత్ప—చెట్టునపూచిన పూవులన్నియును కాయలుగానియట్లే, అరిష్టములు పూర్తిగా కన్పడినను మరణము తప్పవచ్చును. మేడిచెట్టు పూయకుండగనే కాచినట్లు, అరిష్టము తోపకయే మరణమునా గల్గవచ్చును.

చ. మరణ మరిష్టముల్గలుగ మాన దరిష్టము లెన్ని కన్నియున్
మరణము గల్గఁజాలదు, భ్రమం పడుచెనవికావటంచు, ని
ద్ధర మతికానివైన వని, తెల్పుటఁ జూడ ప్రమాదమంచు, సు
స్థిరముగ నూహఁజేయఁ దగు; చిత్తము లోపల నోరమాధవా 37

తాత్ప—అరిష్టములు గల్గినప్పుడొకప్పుడు మరణము మానక కల్గును ఒకప్పుడెన్ని యరిష్టములు తోఁచినను మరణము గల్గదు అట్టివేళలందు ఐనవి కానివనియు కాని వైనవనియు తలఁచుట ప్రమాదముగా నెఱుంగ వలెను.

గీ॥ వపువుమనసు యొక్క స్వాభావికంబగు
ప్రకృతి వికృతిఁ జెంది ప్రబలుటయె, య

రిష్టమంచు మదినెంచి వివరించె స
ద్వైద్యుఁడైన శివుఁడు వసుధఁ గృష్ణ. 38

తాత్ప — మనుష్యుని మనస్సు నందలి స్వభావగుణము మారుచుండుటయే అరిష్టమని, సద్వైద్యుఁడగు శంకరుఁడెఱింగించెను.

త్వ గ్వి కృ తి.

సీ॥ పుడమినుష్ణము శీతముగ
శీతముష్ణముగను మదిలో ననుకొనెడువాఁడు
కాయమ్మునంజలి కాయలుండియును
దాహమ్ముచేఁ బీడ పడఁ బడెడువాఁడు
ఒడలు వేడిగ నుండియును చలిచే గడగడ
లాడుచు వడఁకు వాఁడు
మేనెల్ల దుమ్ముగ్రమ్మిన రీతినెంచి
దెబ్బదవిలిన నెఱుకఁ బడనివాఁడు

గీ. స్నానమును జేసియును జందనమ్ముఁబూసి
కొన్నతఱి నల్లసీఁగలు ముట్టినటుల
నెంచువాఁడు గంధలేకయే సుగంధ
మును గ్రహించు వాఁడును మృతిఁబొందు ; కృష్ణ 39

తాత్ప — వేడిని చలిగాను, చలిని వేడిగాను, తలచువాడును, దేహమున చలియుండియును తాపముచే బాధనందు వాఁడును, శరీరము వేడిగ నుండియును చలివల్ల గడగడ వణకువాఁడును, దేహమంతయు దుమ్ము క్రమ్మినట్లు తలచి దెబ్బ తగిలిన సంగతిని తెలియని వాఁడును, స్నానము చేసినను, చందనము పూసికొనినను, సయితము, రక్తమును ఈగలు కఱచినట్లు తలచువాఁడును గంధము లేకయే గంధమును వాసన చూచినట్లు తలంచు వాఁడును మృతినొందుదురు.

చక్షురింద్రియవికృతి

గీ. గ్రీష్మ మాదిగాఁగల్గు షడృతుల గతులు,
తూర్పు మొదలుగా దెసలగు స్థల విధములు
కర్మగుణ ద్రవ్యముల నిసర్గములు వైప
రీత్యముగ నెంచ నెలలో హరించుఁ గృష్ణ! 40

తాత్ప — గ్రీష్మము మొదలైన ఆరుఋతువుల గతులును, నాల్గు దిక్కుల గుర్తులను, కర్మగుణ ద్రవ్యముల సహజ రీతులను విపరీతముగ నెంచువాఁడు నెలలో మరణించును.

సీ. పగలు సుధాంశు బింబముఁ దారలన్నిశా
కాలమందున రవిన్ గాంచు వాఁడు
మేఘముల్లేకయే మెఱుపు లుఱుమ్ముల వి
ధమ్ముగా మదిలోనఁ దలఁచు వాఁడు
వ్యోమాగ్రమున మేడ లున్నట్లు సురనరా
కృతి బొందినటుల వీక్షించువాఁడు
పొగమంచు వస్త్రముల్గ్రమ్మ న్నగువానిచేఁ
బుడమిగ్రమ్మిన రీతిఁ బోల్చువాఁడు
గీ. భూమిభస్మమై నీటిలోఁ గ్రుంగినటులఁ
గాంచువాఁడరుంధతి ధ్రువనాకాశగంగ
లనెడు నక్షత్రములఁ గాంచనట్టివాఁడు
మృతిని గాంచుట నిశ్చయంబిలను కృష్ణ! 41

తాత్ప — పగటివేళ చంద్రుని, నక్షత్రములను, రాత్రివేళ సూర్యుని చూచు వాఁడును, మబ్బులు లేకయే ఉరుములు మెరుపులు గల్గినట్లు తలచువాఁడును, ఆకాశమున మేడలున్నట్లును, దేవమానవరూపముల బొందినట్లును చూచు వాఁడును, భూమియంతయును పొగమంచుచేతను, బట్టలచేతను కప్పబడినట్లు తోఁచువాఁడును భూమిబూడిద

మై, నీటఁగలసినట్లు చూచువాఁడును, అరుంధతీ ధ్రువాకాశ గంగలను తారలు కాన్పించని వాఁడును, మరణించుట నిశ్చయము.

సీ. ఎండయందైన రేయెండ యందైన న
ద్దమ్మునందైన నుదమునైన
దననీడ గానకుండినవాఁడు తననీడ
నంగహీనమ్ముగానైన, లేక
వాయసశ్వాన గోమాయుపిశాచరా
క్షస వికారాకృతుల్గాననైన
పొగలేని యగ్నిరీతిగఁ గాని సర్పభు
గ్గరళాకృతిగఁగాని గాంచువాఁడు
గీ. కాలగతినొందు రోగమ్ము గల్గియున్న
రోగమే లేక యున్నచో రోగియగు; న
టంచు సర్వజ్ఞుఁ డిట్లెఱిఁగించెఁ గాన
దీనినమ్మఁగాఁ దగుమదిలోనఁగృష్ణ!

తాత్ప—ఓకృష్ణ!—ఎండలో గాని వెన్నెలలోఁగాని అద్దములోగాని తననీడ కనబడకున్నవాఁడును కాన్పించినచో అంగవైకల్యమందినట్లు చూచు వాఁడును, తననీడను కాకి, కుక్క, నక్క, పిశాచము, రాక్షసుడు మున్నగు వికృతాకారములుగా చూచు వాఁడును, పొగలేని అగ్నివలెను పాము నోటి విషమువలెను గాంచువాఁడును, రోగియైనచో మరణించును. అప్పటికి రోగము లేనిచో వ్యాధిగ్రస్తుఁడగును. ఇట్లు శంకరుఁ డెఱిఁగించె గావున నమ్మఁదగును.

## జిహ్వేంద్రియ వికృతి.

చ. తినునట్టివంటి వస్తువుల తీపొగరై చొగరుప్ప నాచిటుల్
గనుపడకుండి దోషయుతఁగాఁ దగుటంచు నొసంగ హెచ్చి, హె
చ్చును గలిగించు మందుఁ దినుచో శమనంబిడుచుం హఠాత్తుగా

గనుఁ గానలేనిచో రసముగ్రన్న నాతఁడు సిద్ధమాధవా! 43

తాత్ప—తినెడు వస్తువులు తీపిగానున్న వగరుగాను వగరుగా నున్న ఉప్పగాను కాన్పించుచు దోషము పొడకట్టెడు మందీయుగా ఎక్కువగుచు, ఎక్కువగుటకు మందీయుగా తగ్గుచు, అకస్మాత్తుగా రుచిని గ్రహింపలేని వాఁడు మృతినొందును.

ఘ్రాణేంద్రియ వికృతి.

క॥ బంధుర గంధమ్మును దు
ర్గంధము దుర్గంధమును సుగంధముగానే
గంధము గ్రహింపకయె వ
రంధ నున్న దుర్గంధమును యెడమృతినిఁజూచును కృష్ణ! 44

తాత్ప—సుగంధమును దుర్గంధముగాను దుర్గంధమును సుగంధముగాను తలచుచు తుదకే గంధమును గ్రహింపలేనివాడు మరణించును.

కర్ణేంద్రియ వికృతి.

సీ॥ ఆకాశ సంబంధమైన నినాదమ్ము
లూరక యే వినుచుండు వాఁడు
నబ్ధినగర వాలాహక యసత్యరవమ్ము
లద్భుతమ్ముగ విను నట్టివాఁడు
నిజముగా వినరాని నిస్వనంబుల నన్య
థా మదిలోపలఁ దలఁచువాఁడు
కానన గ్రామ నిస్వానమ్ములను నాల
కించి వేఱుగ నాత్మ నెంచువాఁడు
గీ. శత్రువరఁగ సంతోషమ్ము మిత్రుఁడనఁగ
దుఃఖమును బొందుచుఁ హఠాత్తుగను మాట
వినఁగనేరనివాఁడు సీ విశ్వసుందు
మరణమునుఁ బొందుఁ నిశ్చయమరయ కృష్ణ! 45

తా—ఊరకయే ఆకాశ సంబంధములగు ధ్వనులను వినువాఁడును, సముద్రపట్టణవలాహక సంబంధములగు ధ్వనుల నస్పష్టముగా వినువాఁడును, వినబడని చప్పుడు విని ఇతరవిధముగా నాలోచన చేయువాఁడును, అరణ్య గ్రామసంబంధములగు ధ్వనులను విని వేఱుగా తలచువాఁడును, విరోధిపేరు విన్న సంతోషమును, స్నేహితుని పేరు విన్న విచారమును పొందువాఁడును, హఠాత్తుగా మాట వినబడనివాఁడును మరణింతురు.

—♦ ఛాయాపై పరీత్యము ♦—

అ॥ ఎవనినీడ నలుపు నెఱుపుఁ బసుపుఁ జిత్ర
వర్ణములుగఁ గానవచ్చు — నతఁడు
శీఘ్రకాలమున నశింపఁగాఁగలఁడంచు
శివుఁడు చెప్పె; నెఱుకచేత, కృష్ణ! 46

తా— సులభము

—♦ ప్రభాపై పరీత్యము ♦—

గీ॥ తనువుకాంతియు లజ్జయుఁ దగ్గుటయును
దేజమోజస్సుగాంతి స్మృతియు హఠాత్తు
గాఁ గలుగుటయు మృతిసూచకములటంచుఁ
దెలిసికొనఁ దగు జ్ఞానంబువలనఁ గృష్ణ! 47

తా—శరీరకాంతియు సిగ్గును సన్నగిలుటయును, తేజస్సును, జ్ఞాపకశక్తియు హఠాత్తుగ గ్గుటయును చావులక్షణములు.

—♦ ఓష్ఠవికృతి ♦—

గీ॥ అరయఁగాఁ గ్రిందిపెదవి వ్రేలాడుచున్న
పై పెదవి పైకి మిగుల నీడ్వబడియున్న
రెండుపెదవులు నేరేడుపండులవలె
నల్లబడియున్నఁగను మరణంబు కృష్ణ! 48

తా—సులభగ్రాహ్యము.

—♦ దంతవికృతి ♦ —

గీ॥ ఏమనుజుని దంతములు నిక్కైతుకముగ
రక్తిమ శ్యామ ధూమ్రవర్ణములు గాంచి
యుండి యాకస్మికమ్ము నూడిపడునొ
అతఁడు తప్పక మరణంబునందు కృష్ణ! 49

తా—ఎఱ్ఱగాను, నీలముగాను, బూడిదరంగుగాను, ఉండి అకస్మాత్తుగ నెవని పండ్లూడిపడునో వాడు తప్పక మరణించును.

—♦ జిహ్వావికృతి ♦—

గీ॥ ఎవనినాలుక వాచి బాడపడి పుండ్లు
బడియు నీలవర్ణముగా బరగుచుండు
నతఁడు స్వల్పకాలమ్మున మృతినిఁగాంచఁ
గలడటంచు శివుఁడు బల్కె గాదె కృష్ణ! 50

తా—సులభగ్రామ్యము.

గీ॥ ఎవని ముక్కు పగిలిగాని, యొండిగాని
క్రిందికణతవక్రత్వంబుఁ జెంది గాని
యుండినను, శ్వాసరొద నాడుచుండినను, గ
తాసులగుదురవ్వార లియ్యవనిఁ గృష్ణ! 51

తా—సులభగ్రామ్యము.

—♦ నేత్రవికృతి ♦—

క॥ ఒక కన్నుపై కుబికి లో
నొకినింకొక కన్నుబోయి నీర్గారుచు నీ
ఒకగ్రుడ్లు నెఱ్ఱఁబడి కద
లిక మానినరోగి బ్రదుకలే దొక కృష్ణ! 52

తా—సులభము,

—♦ కేశవికృతి ♦—

క॥ నెఱికలుపాఱట దీసిన
కరణినున్న బొమలవెండ్రుకలు నూడిన వం
కరఁదిరిగినఁ గన్బొమలా
నరుడు మృతిజెందు మూడునాళ్ళకు కృష్ణ! 35

తా—సులభము.

—♦ దేహావయవప్రక్రియావైపరీత్యము ♦—

గీ॥ నోటి నిడు నన్నమును మ్రింగు నోటు వడుచుఁ
దలనిలువలేక, పిలిచినఁ బలుకలేక
దృష్టిఁ ద్రిప్పఁజాలక జ్ఞానహీనుఁడగుచు
నేకదృష్టినిఁ జూచు వాఁడీల్గు కృష్ణ!

తా— నోటిలో నన్నము పెట్టినను మ్రింగజాలనివాడును, తలసరిగా నిలిపియుంచ లేనివాడును, పిలిచినను పలుకలేకదృష్టిని ద్రిప్పలేక మతిమాలి ఒకేచూపు చూచువాడు మరణించును.

—♦ ఉత్థానవైపరీత్యము ♦—

క॥ బలవంతుఁడైన మఱి దు
ర్బలుఁడైనను లేవఁదీసి పట్టుకొనిన(ఁ)గా
ల్నిలువగఁ జాలకయే మూ
ర్ఛిలునాతఁడు మరణమందు; సిద్ధముకృష్ణ! 55

తా—సులభము.

—♦ ఉత్థానశయనాదివికృతి ♦—

గీ. వెల్లకిలగాఁబరుండియు నెల్లపుడు బ
దమ్ములాడించువాఁడు; జ్ఞానమ్మువీడి
పరువులెత్తెడువాఁడు నిద్ధరణవిడిచి
కాలగతిని దప్పక పొందఁగలడు కృష్ణ! 56

తా—సులభము.

—* శ్వాసవికృతి *—

ఆ. కరచరములు శ్వాస పవనమ్ము శీతల
మంది శ్వాసనాచి యూచివిడుచు
నట్టివాఁడుగాక కటులశ్వాసను నోట
విడుచువాఁడు జీవనుడుగు కృష్ణ!

తా— చేతులు కాళ్ళును శ్వాస గాలియు చల్లబడి శ్వాసను ఆపియాపి వదలువాడున, కాకినచో నోటితో శ్వాసవదలు వాడును చత్తురు.

—♦ నిద్రాది వికృతి ♦—

గీ. ఎల్లప్పుడు తెగతెగక నిద్రించువాఁడు
రేఁబవళ్లును నిద్దుర లేనివాఁడు
చెప్పఁదలఁచినదేదియో చెప్పలేక
మైమఱచువాఁడు బ్రతుకఁటమాను; కృష్ణ!

తా— సులభము

—♦ ఓష్ఠ లేహనాది వికారము ♦—

గీ. ఉత్తరోష్ఠమెప్పుడు నాకు చుండువాఁడు
ద్రేపులుడుగకెల్లపుడుఁ ద్రేచువాఁడు
జెలఁగి ప్రేతలతోడ భాషించువాఁడు
కడగి ప్రేత నివాసమ్ముఁగాంచు కృష్ణ!

తా — ఎప్పుడును పై పెదవినాకుచుండువాఁడును ఎప్పుడును త్రేన్చువాఁడును చచ్చినవారితో మాటాడువాఁడును బ్రతుకరు.

—♦ రోమకూపములనుండి రక్తస్రావము. ♦—

ఆ. ధరవిషార్తుఁడైన పురుషుని రోమ కూ
పములనుండి శోణితము స్రవింప

నతఁడు తత్క్షణంబ మృతిగాంచునని కాల
విదుఁడు దెల్పె లోకవినుతకృష్ణ!

తా—విషముచే ఆర్తినొందినవాని రోమకూపముల ద్వారా రక్తస్రావముమగునెడ అతఁడు వెంటనే మరణించును.

—♦ వాతాష్ఠీల రోగఫలము ♦

గీ. అవనిలో వాతాష్ఠీలమనెడి వ్యాధి
హృదయమునఁ బైకిఁ బ్రాకి బాధించుచుండ
నన్నమంద నిష్టము గల్గునట్టివాఁడు
కాలగతినొందు సంశయము మేలకృష్ణ!

తా—వాతాష్ఠీలమను పేరుగల వ్యాధి హృదయమందు పై బ్రాకి బాధగలిగింప అన్నము తినుట కిష్టము గల్గినవాఁడు మరణించును.

— ♦ శోపరోగము ♦—

గీ. ఏయుపద్రవముల్లేక యే మొదటఁ బ
దమ్ములన్ శోఫగల్గ నిద్దరఁ బురుషులు
మొగము సంగల్గ స్త్రీల్గుదమ్మునను గల్గ
నుభయులును నశింతురసత్యముగ్గ కృష్ణ!

తా—ఏకష్టములును గలుగకుండనే ప్రారంభమున కాళ్ళయందు శోఫయును తెల్లసిపోడ కాన్పించిన పురుషులును ముగమున శోఫకాన్పించిన స్త్రీలనుగుహ్యమున కాన్పించిన ఉభయులును నశింతురు

—♦ అతిసారాద్యుపద్రవములు. ♦—

గీ. వాంతిభేదిహిక్కామహాజ్వరములున్న
శిశ్నవృషణముల్ వాపునుజెందియున్న
శ్వాసకాసామయము గల్గుజనులుగాల
వశులగుదురంచు గుర్తింపవలయుఁగృష్ణ!

తా—శోకులు విరోచనములు ఎక్కుళ్లు మహాజ్వరములున్నను అంగమును వృషణములును వాచియున్నను శ్వాసకాసవ్యాధి సంభవించిన జనులు మరణింతురు.

—♦ స్వేదాద్యుపద్రవములు. ♦—

క. శ్వాసామయులకు మిగులఁ బ
పాసముహిక్కయుఁ జెమటయుఁ బ్రభవించిన నా
యాసమ్ముతోడశనున ని
వాసముగాంచెదరు వారవశ్యముకృష్ణ!

తా—శ్వాసరోగులకు అతిగాఢాహామును ఎక్కుళ్ళును చెమటయు పుట్టినయెడల కష్టపడి మరణించును.

—♦ జంహ్వాదివికృతి ♦—

క. కుడికన్నులోని కేగిన
వడినాలుక నల్లనైన వాసననోటన్
చెడుగాఁగల్గినయెడ నా
తఁడు యమలోకంబుఁగాంచు తథ్యక కృష్ణా! 65

తా—సులభము

—♦ ముఖవికృతి ♦—

గీ. కనులవలన నీరు గారుటవలన మో
మంతదడిసియుండి యంఘ్రీయుగము
చెమ్మటఁ గ్రమ్మి కనులు చెడ్డవ్యాకులతను
జెందియున్న మృతినిఁజెందుకృష్ణ! 66

తా—కన్నులనీరుగారి మొగమంతయు తడిసి అరకాళ్ళు చెమటలు గ్రమ్మి కన్నులందు మిక్కిలి ఆకులపాటు గల్గినను అట్టివాఁడు మరణించును.

—♦ శరీరాంగ వికృతి ♦—

క. తొలుతబరువైన యవయవ
ములఁ జూచుచునుండ సులభముగనుండిన ని
శ్చలముగ నాతఁడు నిలలోఁ
పలజీవముపైన భ్రాంతి వదలును కృష్ణా! 67

తా — ఆరంభమందు బరువుగానుండిన అవయవములు, చూచు చుండగనే తేలికయైనచో అట్టివాఁడు తప్పక మరణించును.

—♦ గంధద్వారా వికృతి ♦—

గీ. ఏనిమొఁడలు బురదవస నూనెనేయి
చేపలకుఁగల్గు వాసనజెందియుండ
నెవనివాంతి సుగంధవస్తువులుగల్గి
యుండు; నాతఁడు బ్రతుకఁ జాలఁడు; కృష్ణ 68

తా — బురద, వసనూనె, నేయి, చేపలకంపువంటి గలశరీర ముఁ గలవాఁడును, పరిమళవస్తువుల వంటివాంతి గలవాఁడును బ్రదు కరు.

—♦ యూకాది వికృతి ♦—

చ. ఎవనిశిరమ్మునందు వసియించెడు పేల్నుదుటందు బ్రాకునో
ఎవరిడినట్టియాబలిని నెప్పుడు గాకములంటకుండునో
ఎవరుజ్వరాతిసారముల నెక్కువ గష్టముగాంచి యుందురో
యవనివి వారు గాలవశులౌదురు నిక్కువ మోరమాధవా 69

తా — తలలోనున్న పేలు నుదుటిపై బ్రాకువారును, తానిడిన బలిని కాకులంటనట్టివారును, జ్వరాతిసారములచే ఎక్కువకష్టము నం దువారును మరణింతురు.

—♦ క్షుద్వికృతి. ♦—

గీ. హితపదార్థమ్ములెన్ని భుజించిన, నుద
కమ్ము గొంతగ్రోలిన, బుభుక్షాపిపాస

లుడుగకయు, మితిమించుచునుండెనేని,
యతఁడు మృతినొందు సత్యమియ్యవనిఁ గృష్ణ ! 70

తా. ఇష్టమైన వస్తువులెన్ని తిన్నను, నీళ్ళెన్ని త్రాగినను, ఆకలి దప్పులణగక, ఇంకను ఎక్కువగువాడు మరణించును.

—♦ ప్రవాహికాద్యుపద్రవము ♦—

క. ధరలోనతిసారమును, ను
దరశూలయు, దప్పి, బలము దగ్గుట దలపో
టరయఁగ నొకపరి గలిగిన
నరుఁ డీలోకంబు విడుచు నమ్మము కృష్ణ ! 71

తా—అతిసారము, కడుపునొప్పి, శక్తితగ్గుట, తలనొప్పిఒక్కసారి కల్గువాఁడు మరణించును.

—♦ మృతినొందుటకు కారణములు ♦—

గీ. తనువశాశ్వతంబగుట నీతనువునకు ని
రూపమృత్యువు; కాని విరుద్ధమగు బ
దార్థములచేఁ బురాకృతమైన కర్మ
చేత మధ్యకాలమున నశించు కృష్ణ! 72

తా—శరీరము స్థిరమైనది కాకుండుటచేత, చావు ప్రాణికి తప్పదు. కాని, విపరీతములైనవస్తువుల చేతను, పూర్వజన్మకర్మచేతను మధ్యకాలముననే నశించును.

క. భూతములు పిశాచమ్ములు
ప్రేతమ్ములు రాక్షసులు విభీకరముగా
భూతలమునరోగినిఁ దా
మాతతముగ నాశ్రయించు నవనినిగృష్ణ! 73

తా—రోగిని భూత, పిశాచ, ప్రేత, రాక్షసులు భయంకరముగా నాశ్రయించును.

క. భూతపిశాచావేశ
స్థితుండౌ రోగి యెట్టిసిద్ధౌషధమున్
ప్రీతిగొనఁబ్రదుకఁడని ప్ర
ఖ్యాతమ్ముగఁజెప్పె; నీలకంఠుడు కృష్ణ!

తా—భూతపిశాచావేశము గల్గినరోగి యెట్టిమంచి మందు సేవించినను బ్రతుకఁడు.

—॥దేహమునందలి స్వభావసిద్ధపదార్థముల వికృతి॥—

సీ. ధవళాంగములు నసితంబుగా మారుట
యసితాంగములు తెల్లనగుట రక్త
వర్ణాంగములు వేఱు వర్ణమ్ములగుట మా
ర్గవములైన విదృఢత్వంబుఁ గనుట
జలనావయవముల చలనంబుగనుట య
చలనంబుగల విచంచలములగుట
పొడవగునట్టివి పొట్టివియగుటయుఁ
బొట్టివి వింతగాఁ బొడవులగుట

గీ. ఆఁగాఁగలవికృతులు నగ్నిమాంద్య
మును, వివర్ణమున్నను. శైత్యమునుహఠాత్తు
గాఁ గలుగుటయు మున్నుగాఁగల యుపద్ర
వములొదవ రోగిబ్రదుకఁడీ వసుధఁ గృష్ణ ! 75

తా. తెల్లని అవయవములు నల్లఁబడుట నల్లని అవయవములు తెల్లబడుటయు, ఒకవిధమైన రంగుగలవి వేఱురంగుగా కనబడుటయు, మెత్తని అవయవములు గట్టిగాఁ గనబడుటయు, కదలు అవయవములు కదలకుండుటయు, కదలనివి కదలుటయు, పొడవగు అవయవములు పొట్టివిగానుండుటయు, పొట్టివి ఆశ్చర్యకరముగా పొడవగుటయు మొదలైన విపరీతములు, అగ్నిమాంద్యము, రంగుమారిపోవుట, వేడి

గాయుట, చలువయు, అకస్మాత్తుగ మారిపోవుట, మొదలైన ఉప ద్రవములు గలుగు రోగి బ్రతుకఁడు.

చ. తనువతిభారమూనినను, తత్క్షణమందున శాంతినొందినన్
కనులనరంబులీడ్చుకొనినన్ జికురమ్ములు దంతముల్ హఠా
త్తున శిథిలంబులై పడిన, దొట్రుపాటునఁ గండ్లు తిరుగుచుం
డిన జముప్రోలికాతడు వడింజనయత్నముసేయు మాధవా. 76

తా. శరీరము మిక్కిలి భారమైనను, వెంటనే శాంతించినను కన్నుల నరము లీడ్చుకొనిపోయినను, వెంట్రుకలు, పండ్లు, అకస్మాత్తుగ రాలిపోయినను తడబాటుచేత కండ్లు తిరిగినను, అతడు మరణించును.

సీ. వపువునందునఁ బవడపురంగు మచ్చలు
పొడముటఁ నరములుబ్బుటఁ శరీర,
మావుపేడ, పాడిపూయబడినట్లుండుట,
ముక్కుదూలము మీద మొగమునందు,
గుఱుపులేచుట, యడుగులు చేతులు మొగమ్ము
కృశతఁగాంచుట, భుజియించియున్న
మూత్రపురీషముల్ పొడమకుండుట భుజి
యింపకున్నను నభివృద్ధియగుట,
పావురము గ్రద్ద, తలమీదవ్రాలుట, హృద
యమునఁగాని వక్షస్థలమందుగాని,
శూలగలుగుట, మధ్యంబు స్థూలమగుట
మరణసూచకములగు నిమ్మహినిఁ గృష్ణ! 77

తా. శరీరమందు ఎఱ్ఱని పగడపుచుక్కలు పుట్టుట. నరములు ఉబ్బియుండుట, శరీరము, ఆవుపేడ, పొడుము, పూయఁబడినట్లుండుట, ముక్కుదూలముపైననుఁ మొగముపైనను కురుపులేచుట, అడుగులు, చేతులు, మొగము చిక్కిపోవుట, తిండితిన్నను, మలమూత్ర

ములు కాకుండుట, తినకున్నను, అధికముగానగుట, తలమీద, పావు రము, గ్రద్దవాలుట, హృదయమందుగాని, ఎదురఱొమ్మునగాని శూలపుట్టుట, నడుములావగుట, చావునకు గుర్తులు.

చ. ఎవనిశరీరభాగముల, నెక్కువగాకృశియించి యుండునో
ఎవని పురీషమున్, కఫము, నింద్రియముల్జలమందు మున్గునో
ఎవనిస్వరంబు హీనమయి, యెక్కువగద్గదగల్గియుండునో
యవనిని వాఁడు గాలగతినందుట నిక్కువమోరమాధవా. 70

తా. అవయవములుచాల కృశించినవాఁడును, మలము, కళ్లె రేతస్సుమున్గునట్టివాఁడును, హీనమై ఎక్కువడగ్గుత్తిక పడియుండువాడును, మరణించును.

చ. కనుఁగానదృష్టిమార్గమునఁ గన్పడు వస్తువులెల్లఁ దున్కలై
కనఁబడుచున్నఁగేశములు, గాయముఁ దైలముఁబూసినట్టులు
న్నను క్షయరోగమందునశనఁబహితంబును, వాంతులున్నఁగా
సనగడుదప్పిగల్గిననఁ జావకమానఁడతండు మాధవా! 79

తా. దారిలో కనబడు వస్తువులు ముక్కముక్కలై పోవుచున్నట్లు తోఁచినను, వెండ్రుకలును, శరీరమును,నూనెపూసినట్లున్నను, క్షయరోగమందు అన్నద్వేషమును, వాంతులును గల్గినను, దగ్గులో దాహము గల్గినను, అట్టివాఁడు మరణించును.

గీ. వాడినట్టిపూవుల కాంతివంటి మచ్చ
లున్న, శూలరోగమ్మున, నురుతరముగ
గళ్లె, నురుగు, రక్తమును గ్రక్కుచున్న
నతఁడు జీవింపఁడని నమ్మనగును కృష్ణ! 80

తా. వాడిపోయిన పూవులవంటి మచ్చలున్నను, శూలవ్యాధియందు కళ్లె, నురుగు, నెత్తురు, గ్రక్కుచున్నను అతఁడు బ్రదుకఁడు.

సీ. వదనకరాంఘ్రులు వాచియుండి శరీర
మెక్కువగాఁ గృశియించి భుక్తి

యందిచ్ఛలేక, హస్తాంఘ్రులు మూపురం
బులు శిథిలీభూతములయియుండి,
జ్వరము, గాసముగల్గి, ప్రాతఃసమయమున,
భుజియించు నాహారమును గ్రమముగ
నపరాహ్ణమునఁ గ్రక్కునట్టివాఁడును మేఁక
వలె నఱచుచు నేలపైనిఁ బడుచు,
నొడలెఱుంగక వృషణముల్ విడిచి శిశ్న
మును మిగులలోనికెగ నీడ్చుకొని శిరంబు
వాల్చి స్పృహఁ దప్పియున్నట్టి శ్వాసరోగి
బ్రదుకుపై నాశవదలు భావమునఁ గృష్ణ. 81

తా. మొగము, చేతులు, పాదములు, వాచియుండగా, దేహ
ము అధికముగా చిక్కి తిండితిన నిష్టములేక, చేతులు, కాళ్ళు శిథిల
ములై పోయియుండి, జ్వరము, దగ్గు, కలిగి ప్రొద్దునతిన్న తిండి సా
యంత్రమునకు కక్కుకొనువాడను మేకవలె అరచి క్రిందఁబడి, తన
శరీరమును, తానెరుగక పిచ్చలు, శిశ్నమును వదలి మిక్కిలి లోపలి
కీడ్చుకొని తలవాల్చి మతి తప్పియున్న శ్వాసరోగి బ్రదుకడు.

—♦ వైద్యుని లక్షణము ♦—

చ. నయగుణవర్తనంబు ; సహనంబు; వచ పరిశుద్ధరోగని
ర్ణయకుశలంబు, ధైర్యముగనద్దిమణంబు కృపాస్వభావ మ
వ్యయతరదైవ భక్త్యమృతహస్తములం జెలువందు వాని ని
శ్చయముగ వైద్యుఁ డంచును బ్రశంసయొనర్పగవచ్చు మాధవా.

తా. మంచి నడవడికయును, ఓర్పును, మాట శుభ్రితయు,
రోగనిర్ధారణ చేయఁగల నేర్పును, ధైర్యమును, దయగల మనస్సును
తక్కువకాని దైవభక్తియును, అమృతహస్తమును, ఇవికలవానిని వై
ద్యుఁడని మెచ్చుకొనవచ్చును.

క. ఆయుర్వేదము సర్వప్ర
జ్ఞాయుతుఁడై తర్కగణితశాస్త్ర పరిచయ
శ్రీయుతుఁడై సాక్షాన్నా
రాయణుఁబలె వైద్యుఁడిల విరాజిలుచుండున్ 83

తా. ఆయుర్వేదమందు సమర్థతఁ గలవాఁడై శ్రేష్ఠమగు నా శాస్త్రమందలి పరిచయమను లక్ష్మిఁగలవాఁడై, వైద్యుఁడు, నారాయణమూర్తివలె ప్రకాశించును.

క. కాలము దత్త్వము రోగము
మూలముఁ గన్గొనక వైద్యమునుఁ జేసిన నా
ఫాలాక్షునకైనను ని
ర్మూలము చేయంగవశమె రోగము కృష్ణ. 84

తా. కాలమును, తత్త్వమును, రోగమును ,మూలము నెఱుగక వైద్యముచేసినచో ఫాలాక్షుడైనను కుదుర్పలేఁడు.

—◆ వైద్యవిషయికావశ్యక విషయములు ◆—

చ. పనిగొనివైద్యునిం బిలువ బైలువెడల్పమయమ్మునన్ బథ
మ్మున మిగులంగ దుశ్శకునము ల్గనిపించిన నింటఁజూడఁ బో
వునపుడతండు, నిద్దురకు బోవుచునుండిన దైన్య మానసం
బునఁ బొడకట్టినన్ మృతినిబొందక మానఁడురోగి; మాధవా. 85

తా. వైద్యుని బిలుచుకొనివచ్చుటకు బయలుదేరు వేళను దారిలో అపశకునములు గాన్పించినను, వైద్యుని యింటికివెళ్ళినప్పుడాతఁడు నిద్రబోవుచున్నఁ గాని, అతఁడు విచారముఖములో కన్పడినను రోగి బ్రతుకనోపఁడు.

కఁ అగదంకరుఁ డౌషధము నొ
సగుచోఁ గైకొనక క్రింద జారిపడిన నె

వ్యాగచేఁ జిత్తమరోగమయ
ముగనుండిన రోగి బ్రదుకఁ బోవను కృష్ణ! 86

తా. వైద్యుఁడు మందీయబోయిన సమయమున, పుచ్చుకొనక క్రింద జారవిడిచినను, విచారముచే మనస్సు గంద్రగోళముగా నున్నను, ఆరోగి బ్రతుకఁడు.

సీ. వైద్యుఁడు తనుఁజూడవచ్చు తరిని రోమ్ము
పైఁ గొత్తఁగఁ జెమటపట్టియున్న
మట్టిపెల్లచేత మట్టిపెల్లనుగాని
కట్టెచేత నొక్క కట్టెఁగాని
గొట్టుచున్న గడ్డి కొసఁ ద్రుంచుచున్నను
మరి క్రింది పెదవిని గొఱుకుచున్న
మీఁదిపెదవి నాక్రమించి నాకుచు నున్న
దలవెండ్రుకలను జెవుల జలింపఁ
జేయుచున్న గురువులను స్నేహితులను
దేవతలను మరియుధరా దేవతలను
జెలఁగి మదిలోన నెప్పుడు దూషించుచున్న
నట్టిరోగి జీవింపఁ డియ్యవనిఁ గృష్ణ!
తా. సులభము.

సీ. వసుధలో వక్రానువక్ర సంచారము
ల్గలిగిన గ్రహము లల్పపదవుల వ
సించి జన్మర్క్షమునకు సిలుగునొందించిన
నశని యుల్కాతార లరయఁగోరఁ
గడు బాధనొందింపఁ గల్గిన నింటిపై
వాయసగృధ్రిముల్ వాలుచున్న
నిష్కారణముగ దుర్గినను మంచము శిథి
లమ్ములైనను వాయసమ్ము లెల్ల

గీ. భార్యజంతువులనుఁ బ్రసవించినను రత్న
హారములకుఁ గల్గునట్టి కాంతి
తగ్గుచున్న రోగితప్పక పరలోక
వాసుఁడగును సుమ్ము వసుధఁ గృష్ణ! 88

తాత్ప:—సులభము.

—♦ విపరీత చికిత్సా ఫలము ♦—

ఉ. ఎంతచికిత్స చేసిన నొకింతయు తగ్గక వ్యాధి హెచ్చు చో
క్కింతయు నౌషధంబిడక యే కడువింతగ తగ్గినన్ బలం
బంతయుఁ దగ్గిక్షీణగతి నందె వికారము లంతకంతక
త్యంతమునౌచు నున్న యెడనాతఁడిహమ్ము ను వీడు మాధవా! 89

తాత్ప:—ఎన్నిమందు లిచ్చినను తగ్గక ఎక్కువగుచున్నను మందీయకయే అకస్మాత్తుగ తగ్గి పోయినను, బలముతగ్గి, వికారము లెక్కువగు చున్నను, అట్టివాడు మరణించుచు.

—♦ పుష్పిత మనుష్యుఁడు ♦—

చ. వివిధలతాద్రుమాయతనవీన వనంబున నుండి వీచు వా
యువువలె నేనిదేహమున నుండి సుగంధ తరానిలంబుఁ రేఁ
బవలును వీడకుండఁ గనవచ్చునొ; పుష్పితుడంద్రు వాని, ని
య్యవనిని వాఁడొకబ్దమున కంతముఁ జెందగలండు మాధవా! 90

తాత్ప:—అనేక రకములగు పూవులతో గూడినవనమునుండి వచ్చు పరిమళము వలె తన శరీరమునుండి పరిమళము రాత్రింబవళ్ళు నువచ్చు వానిని పుష్పితుఁడందురు వాఁడొక సంవత్సరమునకు మరణించును.

గీ. మహిని, నొక్కొక్క పుష్ప సంబంధమైన
ఘనతర సుగంధమైన దుర్గంధమైన
నేనరుని దేహమందు గాన్పించు చుండు
నతఁడుగూడ పుష్పితుఁడన నలరుఁ గృష్ణ! 91

తాత్ప:—సులభము.

చ. గురుతరమైన చెంగలువ కోష్టగరున్ తగరంబు నింక పు
ష్పరసము మంచిగంధముల వాసన కన్పడుచున్నగాని దు
ర్భర శవమూత్ర గంధముల వాసనగన్పడు చున్నగాని యా
నరుఁడిలలోనఁ బుష్పితుఁడనందగు నిక్కువ మోరమాధవా! 93

తాత్ప:—చెంగల్వకోష్టు అగరు తగరము పూదేనె మంచి గంధము, వీని వాసన యైనను భరింపరాని శవసంబంధమగు మల మూత్రముల వాసనగాని శరీరమునుండి వెడలు నరుఁడును పుష్పితుఁ డనఁబడును.

గీ. రోగికి జ్వరము లేక నిరూఢిగా, సు
గంధ కారణమున్ లేక, కాయమున, సు
గంధమైన మరియును, దుర్గంధమైన
దోఁప నతఁడేడు గూడ బ్రదుకఁడు; కృష్ణ! 93

తాత్ప:—సులభము.

—♦ రసజన్య వికారము ♦—

గీ. వ్యాధి లేకుండినపుడు గాయమ్మునందు
గలరసమ్ముల నరయ రోగమ్ము వచ్చి
నంత విరసత్వమో లేక యమితరుచియొ
కనఁబడు రసస్థితి విధంబు గనఁగఁ గృష్ణ! 94

తాత్ప:—ఓకృష్ణ! రసస్థితియొక్క రీతి నాలోచింపగా వ్యాధి లేకుండిన సమయమునను శరీరమందున్న రసములను చూడగా రోగ మువచ్చినంత రసహీనతయో మిక్కిలి రుచియో కనఁబడును.

—♦ రసజ్ఞాన పరీక్ష ♦—

క. రోగి శరీర రసను రుచి
బాగుగఁ గన్గొనఁగ వచ్చు బరికింపంగా
నీఁగలును జీమలు మొదలు
గాఁగల జంతువుల వల్లగరిమను కృష్ణ! 95

తాత్ప:—ఈగలు చీమలు మొదలగువాని చర్యల వలన రోగి

శరీర రసపు రుచిని గ్రహింపవచ్చును.

చ. క్షితివిరసత్వమొందిననుఁ జేరవు చీమలు నీఁగలున్ బవి
త్రతను వహించియున్న మధురత్వము నొందిన మక్షికాదులం
చితముగఁ జుట్టుముట్టియు స్పృశించుచుండిన నట్టిరోగి పు
ష్టితుఁడయి స్వల్పకాలమునఁజెందును మృత్యువునోరమాధవా! 96

తాత్ప:—రసము లేకున్న చీమలు ఈగలును చేరవు పవిత్రము గానున్నను దీయదనముగా నున్నను ఈగలు చీమలు చుట్టును జేరి వ్రాలుచున్నను ఆరోగి పుష్టితుఁడై స్వల్పకాలమున మరణించును.

నోరు మూఁడు వ్రేళ్ళు పట్టకుండఁ బట్టుకొనుటకు ఫలము.

గీ. దంతముల మధ్య నంగుళిత్రయము నుంచ
నెడము లేకుండ నోర్మూత పడినయెడల
నతఁడు సప్తరాత్రులకు గాయమ్ము విడిచి
మృత్యువునుఁ గాంచగానేగు బుతము కృష్ణ! 97

తాత్ప: — పంక్తి సమము మూఁడు వ్రేళ్ళుంచినచో సందు లేకుండ నోరుమూత పడినయెడల 7 దినములలో మరణించును.

—♦ కొన్ని మరణ చిహ్నములు ♦—

గీ. మాతృమండలమును చంద్రమః కళంక
మును ధ్రువర్క్షమ్మునుం గనుగొనని వాఁడు
గర్దమాదులందుంచిన కాళ్ళు దెగిన
వంటు నెంచువాఁడు నశించు; కృష్ణ! 98

తా. మాతృమండలమును, చంద్రమండల మందలి మచ్చను, ధ్రువనక్షత్రమును చూడలేని వాఁడును కర్దమాదులం దుంచిన కాళ్ళు తెగినవని తలచువాఁడును మరణింతురు.

క. ఉరము మిగులఁ గృశియించుచు
దేహముఁజెమట పట్టుచున్న నాసనము పదా
తరువాత దలపయినఁ బొగ
లను నెంచుచు నున్న జచ్చు రాత్రిఁడు కృష్ణ! 99

తా, ఎదురొమ్ము మిక్కిలి ఎండిపోఁ వను, మాటిమాటికి

ని, చెమ్మట పట్టుచున్నను, స్నానముచేసిన తరువాత తలమీద పొగలు గ్రమ్మినట్లున్నను, అట్టివాఁడు మరణించును.

గీ. వాయి యందేమి లేనట్టిపక్షి యెవరి
నెత్తిమీఁద నెక్కి పొడుచు; నిగ్గతముగ
నతఁడు స్వల్పకాలమ్ములో మృతినిఁ గాంచు
నంచు వచియింతు గాలజ్ఞుఁడవనిఁ గృష్ణ! 100

తా. నోటిలో నేమియు లేనిపక్షి నెత్తిపై నెక్కి పొడిచిన నాతఁడు మరణించును.

—◆ విపరీత చిహ్నములు. ◆

క. చెవులం దెఱచుకొనియు నా
రవముల విన నట్టివాఁడు రమ్యాహారం
బవిరళముగ మెసవుచు స
త్తువఁ గలుగనివాఁడు దాఁ బ్రదుకఁడిలఁ గృష్ణా! 101

తా. చెవులు విప్పుకొనియుండియు ధ్వనినివిననివాఁడును తిండి తినుచునే ఆకలి తీరనివాఁడునుఁ బ్రదుకరు.

గీ. కాంతిహీనుఁడయ్యు హఠాత్తుగా బ్రకాశ
మందువాఁడు కృశీభూతుఁడై విచిత్ర
గతిగ బలిసినవాఁడు నాకాలగతిని
గాంచకుండక పోఁడు నిక్కముగఁ గృష్ణ! 102

తా. కాంతిమాసిపోయి అకస్మాత్తుగా దివ్యమైనకాంతితో ప్రకాశించువాఁడును, చిక్కి విచిత్రముగా బలిసినవాఁడును బ్రదుకరు.

భోజనాది వైపరీత్యము.

గీ. కారణము లేక కొలది యాహారమునఁ గృ
శించుచాహారమును భుజియించినఁ గడు
మైకమొదవిన గ్రుడ్డులేమాడ్కిఁ గాన
బడకయున్న నతఁడు జీవముడుగుఁ గృష్ణ! 103

గీ. గోరులును వెంట్రుకలు నూడి జారిపడిన
నెడమ కన్నుండి నీరు స్రవించుచున్న

నబలుఁడై యుండియును నహీనబలుఁడయిన
రోగిజీవింపఁడీక్షితిలోనఁ గృష్ణ! 104

తా. కారణము లేకయే కొద్ది అన్నముతినుచు, చిక్కిపోవు వాఁడును ఎంతతిండి తిన్నను, మొకముగల్గి కండ్లుకానరాకయున్న వాఁడును బ్రదుకరు. గోళ్లు, వెంట్రుకలు ఊడిపడ్డను, ఎడమకన్నునీరు గారినను చిక్కియుండి శేషముగా బలిసినను, ఆరోగి బ్రదుకఁడు.

క. మణిబంధము మొగముపయిని
నునుచుకొని రొమ్ముకించు కేనియును రవికాంతిఁ
గనఁజాలక పీనుగువా
సనగొట్టెడువాఁడు బ్రదుకఁ జాలఁడు కృష్ణా! 105

తా. సులభము.

— అరిష్టములు —

గీ. పువ్వు పండును నగ్నిని బొగయుమబ్బు
వానరాక క్రమతఁ దెల్పుపగిది నరుని
మృత్యువునుఁ దెల్పుటకు నరిష్టములుగ
తంబుగానుండు సుమ్ము; సత్యంబు కృష్ణ! 106

తా. పువ్వు, పండు, నిప్పు, పొగ, మబ్బు, వర్షమువచ్చుట మృత్యువునుతెల్పు అరిష్ట సూచనలు.

— వైద్యుని యరిష్టజ్ఞానము. —

క. మరణోన్ముఖుఁడగు రోగికి
నరిష్టములు దెలిసికొనక యౌషధమిడినన్
బరిహాసమగును గనుకా
యరిష్టములు వైద్యుఁ డెఱుఁగనగు; నిల కృష్ణా! 107

తా. చావుదగ్గర బడిన రోగియొక్క అరిష్టముల నెఱుగకుండ మందిచ్చిన పరిహాసమగును; కనుక వైద్యుఁ డెఱుంగవలెను.

— అరిష్ట శాంతి. —

గీ. పృథివిలో నరిష్టములు గాన్పించురోగి
బ్రదుకఁడైన మందిడుచు జపముదపంబు

బ్రాహ్మణులచేతఁ జేయింప ఫలముకానో
కప్పుడొదవుననియె శివుఁడవనిఁ గృష్ణ! 108

తా. అరిష్టములుతోఁచు రోగి బ్రదుకడని ఆశ వదలుకొనవలెను. ఐనను మందులిచ్చుచు బ్రాహ్మణులచేత జపము తపము చేయించిన ఒకప్పుడు బ్రదుకవచ్చునని శివుఁడు చెప్పెను.

—♦ కృష్ణకాలపురుష ఫలము. ♦—

గీ. ఆకసంబునఁ గనుపించునట్టి నీడ
మహినలుపు దోఁచెనేనియా మనుజుఁడారు
మాసములలోన యమరాణ్ణివాసమునకు
నరుగ యత్నంబుసేయుఁ దానాత్మ; కృష్ణ! 110

తా. సులభము.

—♦ పీతనీలాది వర్ణఫలము. ♦—

ఆ. ఛాయ పీతవర్ణమై యున్నవ్యాధియు
నలుపు నెఱుపునైనఁ గలుగుహత్య
చిత్రవర్ణమైనఁ జిత్తమ్మునకుమహా
భయముగలుగు; నందువలన కృష్ణ! 111

తా, ఆకాశమందలి తననీడ, పసుపుపచ్చగా నుండిన రోగము, రంగురంగులుగా నున్న మనసునకు భయమును కలుగును.

—♦ అంగహీన కాలపురుషుని ఫలము. ♦—

క. ధరఛాయాపురుషుని పద
మఱయఁగ విఱిగినట్టులున్న నాఱ్నెలలకుఁ బం
ధురగుల్ఫములట్లగుచో
మఱి వత్సరమునకు గల్గు మరణము కృష్ణ! 112

తా. ఛాయాపురుషుని కాలు విరిగినట్లున్న ఆరునెలలకును గుల్ఫములవలె నున్నచో సంవత్సరమునకును, మృతికల్గును.

గీ. పరికించిచూడ ఛాయా
పురుషుని హృదయంబు నష్టమునుఁ బొందిన వ
త్సరయుగమున కాయుష్యము

పరిపూర్ణాణంబవ్వునటంచుఁ బల్కిరి; కృష్ణ! 113

తా. ఛాయాపురుషుని హృదయము కనఁబడక పోయినచో 2 సంవత్సరములకు మరణించును.

గీ. ధరణీతలమున ఛాయా
పురుషుని గుడిచేయి విరిగిపోయినఁ జుట్టాల్
మరణింతు రెడమ చేయటు
విరిగిన భార్యయు నశించు నె టనె కృష్ణ! 114

తా. సులభము

క. అరయఁగ ఛాయాపురుషుని
శిరమును దక్షిణకరంబు శిధిలమయిన నా
పురుషుడు కొలదిదినంబుల
మరణము నొందంగఁగలఁడు మహిలోఁ గృష్ణ! 115

తా. ఛాయాపురుషుని తలయుకుడిచేయియు నాశనమైన యెడల అట్టివాడు కొద్దిరోజులలో మరణించును.

క. శిరహీనమైన నెల కం
ధరహీనంబైనచో దినము లెన్మిది జం
ఘరహితమైన దినములేన్
మరుగు వడిన నపుడుగల్గు మరణము కృష్ణా! 11[illegible]

తాత్ప:—తలలేని యెడల నెలలోను, మెడలేని యెడల ఎనిమిదిరోజులలోను, తొడలేని యెడల రోజులోను శరీరమేకనబడనిచో వెంటనే మరణము గల్గును.

—♦ ఛా యా పు రు ష ల క్ష ణ ము. ♦—

క. ఛాయాపురుషుని లక్షణ
మీయిలలో తెలిసికొనిన నెవరైనను బ్ర
జ్ఞాయుత కాలత్రయవిదు
లై యశమున్ గాంచఁ గలరిహమ్మునఁ గృష్ణా! 117

తాత్ప:—ఛాయాపురుషలక్షణ మెరిగిన వారు త్రికాలవేదులై కీర్తిగాంచఁ గలరు,

క. దూరస్థుఁడైన నరుఁడే
కారణమునఁ దెలియఁగలఁడో కాలమ్మును నా
కారణము శివుఁడు చెప్పిన
తీరుగ వచియింతు జనులు తెలియఁగ కృష్ణా! 119

తాత్ప—దూరమున నున్న మనుష్యుడే హేతువుచే కాలము నెఱుఁగ గలఁడో ఆకారణమును మనుష్యులు తెలిసికొనుటకై శివుడు చెప్పిన రీతిగానే, చెప్పెదను.

—♦ ఏకాంత చాయాసాధనము ♦—

గీ॥ నిర్జన స్థలమ్మునకేగి నిలచి సూర్యు
నకు వెనుకఁ దిర్గి ఛాయఁ గంఠస్థలమునఁ
జూచి యాకసమందు సంకోచముడిగి
కనుఁగొనిన శివుఁ డగుపడుగాదె! కృష్ణా! 118

తాత్ప—ఒంటరిచోటికిఁబోయి నిలువఁబడి సూర్యునకు వెనుకతిరిగి నిలువఁబడి నీడయొక్క కంఠప్రదేశమున జూచి క్రమముగా ఆకాశమునకు అనుమానము లేక చూచిన కాన్పించును.

గీ. ఎలమి "ఓం హ్రీం పరబ్రహ్మణేనమో"య
టన్న మంత్రంబు నాత్మలో నధికభక్తి
నూట యెనిమిది సారు లనూనముగ జ
పింపనిష్టర్థమపుడ లభించుఁ గృష్ణ! 120

తాత్ప— "ఓం హ్రీం పరబ్రహ్మణేనమో" అను మంత్రము 108 సారులు జపింప ఇష్టార్థము అప్పుడే చేకూరగలదు.

క॥ పరిశుద్ధస్ఫటికాకృతిఁ
బరగుచు వివిధాకృతుల విభాసిల్లెడు శం
కరుఁగన్నవాఁడు జీవుల
కరయఁగ దావిభుఁడగును నయమ్మగ కృష్ణా! 121

తా—తెల్లని స్ఫటికాకారముతో నొప్పుచు వివిధాకృతులు గల విగ్రహము కనఁబడినవాఁడు లోకపాలకుఁడగును.

—♦ రెండు సంవత్సరములలోఁ ద్రికాలజ్ఞుఁడగుట ♦—

గీ. ఇట్లు రెండువత్సరముల నేకదీక్ష
ననుదినంబును యోగాభ్యాస మొనర్చు
మనుజుఁడిల సర్వశక్తి సంపన్నుఁడగుచు
నెఱుఁగుఁ గాలత్రియమ్ముఁ దానెలమిఁ గృష్ణ! 122

తా—ఈవిధముగా రెండేండ్లు ఏకదీక్షగా ప్రతిరోజును యోగాభ్యాసము చేసినవాఁడు సర్వశక్తిసంపన్నుఁడై త్రికాలముల నెఱుఁగును

—♦ నిరంతర యోగాభ్యాసఫలము ♦—

క॥ అనయము యోగాభ్యాసం
బును నిశ్చల చిత్తమూని పొనరించిననా
మనుజునకు దుర్లభంబిలఁ
గనరాదని చాటిచెప్పఁగాదగు గృష్ణ! 123

తా—ఎల్లప్పుడును ఇట్లు యోగాభ్యాసమును నిశ్చలచిత్తమును బూని చేసినచో మనుష్యునకు చేతగానిది లేదు.

క॥ దేవా! భూతనిచయ సము। భావానిర్మలతర ప్రభావా! శ్రిత సం
జీవా! పూజితపదరా। జీవా! నీ సేవ నెపుడు చేసెదఁ గృష్ణ! 124

—♦ విజ్ఞప్తి ♦—

క॥ శ్రీకృష్ణుని కృపచే నాం
ధ్రీకరణముఁ జేసినాఁడ దీనజనులను కం
పాకలితులై సహింపుం
డీ కాలజ్ఞానమునుఁ బరీక్షించి మదిన్ 125

గద్య.

ఇది శ్రీకృష్ణ గురు వరప్రసాద సమాసాదిత కవితా
ధౌరేయ సకల సుజనవిధేయ దేవినేని సూరయ
నామధేయ ప్రణీతంబైన వైద్యరహస్య
దీపికయను నామాంతరముగల
సతాత్పర్య కాలజ్ఞానము
సంపూర్ణము.

తాత్ప:—సులభము.

చ. గురుతరమైన చెంగలువ కోష్టగరున్ తగరంబు నింక పు
ష్పరసము మంచిగంధముల వాసన కన్పడుచున్నగాని దు
ర్భర శవమూత్ర గంధముల వాసనగన్పడు చున్నగాని యా
నరుఁడిలలోనఁ బుష్పితుఁడనందగు నిక్కువ మోరమాధవా! 92

తాత్ప:—చెంగల్వ కోష్టు అగరు తగరము పూదేనె మంచి గంధము, వీని వాసన యైనను భరింపరాని శవసంబంధమగు మల మూత్రముల వాసనగాని శరీరమునుండి వెడలు నరుఁడును పుష్పితుఁ డనఁబడును.

గీ. రోగికి జ్వరము లేక నిరూఢిగా, సు
గంధ కారణమున్ లేక, కాయమున, సు
గంధమైన మరియును, దుర్గంధమైన
దోఁప నతఁడేడు గూడ బ్రతుకఁడు; కృష్ణ! 93

తాత్ప:—సులభము.

—♦ రస జన్య వికారము ♦—

గీ. వ్యాధి లేకుండి నపుడు గాయమ్ము నందు
గలరసమ్ముల నరయ రోగమ్ము వచ్చి
నంత విరసత్వమో లేక యమితరుచియొ
కనఁబడు రసస్థితి విధంబు గనఁగఁ గృష్ణ! 94

తాత్ప:—ఓకృష్ణ! రసస్థితియొక్క రీతి నాలోచింపగా వ్యాధి లేకుండిన సమయమునను శరీరమందున్న రసములను చూడగా రోగ మువచ్చినంత రసహీనతయో మిక్కిలి రుచియో కనఁబడును.

—♦ రస జ్ఞాన పరీక్ష ♦—

క. రోగి శరీర రసము రుచి
బాగుగఁ గన్గొనఁగ వచ్చు బరికింపంగా
నీఁగలును జీమలు మొదలు
గాఁగల జంతువుల వల్లగరిమను కృష్ణ! 95

తాత్ప:—ఈగలు చీమలు మొదలగు వాని చర్యల వలన రోగి

శరీర రసపు రుచిని గ్రహింపవచ్చును.

చ. క్షితివిరసత్వమొందినను జేరవు చీమలు నీఁగలున్ బవి
త్రతను వహించియున్న మధురత్వము నొందిన మక్షికాదులం
చితముగఁ జుట్టుముట్టియు స్పృశించుచుండిన నట్టిరోగి పు
ష్టితుఁడయి స్వల్పకాలమునఁ జెందును మృత్యువునోరమాధవా! 96

తాత్ప:—రసము లేకున్న చీమలు ఈగలును చేరవు పవిత్రము గానున్నను దీయదనముగా నున్నను ఈగలు చీమలు చుట్టును జేరి వ్రాలుచున్నను ఆరోగి పుష్టితుఁడై స్వల్పకాలమున మరణించును.

నోరు మూఁడువ్రేళ్ళు పట్టకుండఁ బట్టుకొనుటకు ఫలము.

గీ. దంతముల మధ్య నంగుళిత్రయము నుంచ
నెడము లేకుండ నోరూత పడినయెడల
నతఁడు సప్తరాత్రులకు గాయమ్ము విడిచి
మృత్యువునుఁ గాంచగానేగు ఋతము కృష్ణ! 97

తాత్ప:—పండ్ల నడుమ మూఁడువ్రేళ్ళుంచినచో సందు లేకుండ నోరుమూత పడినయెడల 7 దినములలో మరణించును.

—♦ కొన్ని మరణ చిహ్నములు ♦—

గీ. మాతృమండలమును చంద్రమః కళంక
మును ధ్రువర్క్షమ్మునుం గనుగొనని వాఁడు
గర్దమాదులందుంచిన కాళ్ళు వెగిన
వంటు నెంచువాఁడు నశించు; కృష్ణ! 98

తా. మాతృమండలమును, చంద్రమండల మందలి మచ్చను, ధ్రువనక్షత్రమును చూడలేని వాఁడును కర్దమాదులం దుంచిన కాళ్ళు తగ్గినవని తలచువాఁడును మరణింతురు.

క. ఉరము మిగులఁ గృశియించుచు
దటముఁజెమట పట్టుచున్నఁదాన యయిన దా
తనువాత దలపయినఁ బొగ
లరుచుంచుచు నున్న ఒచ్చునాతఁడు కృష్ణ! 99

తా, ఎరురుబొమ్ము మిక్కిలి ఎండిపోయినను, మాటిమాటికి

ని, చెమ్మట పట్టుచున్నను, స్నానముచేసిన తరువాత తలమీద పొగలు గ్రమ్మినట్లున్నను, అట్టివాఁడు మరణించును.

గీ. వాయి యందేమి లేనట్టిపక్షి యెవరి
నెత్తిమీద నెక్కి పాడుచు; నిర్గతముఁగ
నతఁడు స్వల్పకాలమ్ములో మృతినిఁగాంచు
నంచువచియించె గాలజ్ఞుఁడవనిఁ గృష్ణ! 100

తా. నోటిలో నేమియు లేనిపక్షి నెత్తిపైనెక్కి పాడిచిన నాతఁడు మరణించును.

—♦ విపరీత చిహ్నములు. ♦

క. చెవులం దెఱచుకొనియు నా
రవముల విన నట్టివాఁడు రమ్యాహారం
బవిరళముగ మెసవుచు స
త్తువఁగలుగనివాఁడు దాఁ బ్రదుకఁడిలఁ గృష్ణా! 101

తా. చెవులు విప్పుకొనియుండియు ధ్వనినివిననివాఁడను తిండి తినుచునే ఆకలి తీరనివాఁడునుఁ బ్రదుకరు.

గీ. కాంతిహీనుఁడయ్యు హఠాత్తుగా బ్రకాశ
మందువాఁడు గృశీభూతుఁడై విచిత్ర
గతిగ బలిసినవాఁడు నాకాలగతిని
గాంచకుండక పోఁడు నిక్కముగఁ గృష్ణ! 102

తా. కాంతిమాసిపోయి అకస్మాత్తుగా దివ్యమైనకాంతితో ప్రకాశించువాఁడును, చిక్కి విచిత్రముగా బలిసినవాఁడును బ్రదుకరు.

భోజనాది వైపరీత్యము.

గీ. కారణములేక కొలది యాహారమునఁ గృ
శించుచాహారమును భుజియించినఁ గడు
మైకమొదవిన గ్రుడ్డుతేమాడ్కిఁగాన
బడకయున్న నతఁడు జీవముడుగుఁ గృష్ణ! 103

గీ. గోరులును వెంట్రుకలు నూడి జారిపడిన
నెడమ కన్నుండినీరు స్రవించుచున్న

నబలుఁడై యుండియును నహీనబలుఁడయిన
రోగిజీవింపఁడిక్షితిలోనఁ గృష్ణ! 104

తా. కారణము లేకయే కొద్ది అన్నముతినుచు, చిక్కిపోవు వాఁడును ఎంతతిండి తిన్నను, ముకముగ్గిగ్గి కండ్లుకానరాకయున్న వాడును బ్రదుకరు. గోళ్లు, వెంట్రుకలు ఊడిపడ్డను, ఎడమకన్నునీరు గారినను చిక్కియుండి శేమముగా బలిసినను, ఆరోగి బ్రదుకఁడు.

క. మణిబంధము మొగముఁ నయిని
నణుచుకొని యొకించు కేనియును రవికాంతిఁ
గనఁజాలక పీనుగువా
సనగొట్టెడువాఁడు బ్రదుకఁ జాలఁడు కృష్ణా! 105

తా. సులభము.

—♦ అరిష్టములు. ♦—

గీ. పువ్వు పండును నగ్నినిబొగయుమబ్బు
వానరాక గ్రమతఁ దెల్పుపగిది నరుని
మృత్యువునుఁ దెల్పుటకు నరిష్టములుగ
తంబుగానుండు సుమ్ము; సత్యంబు గృష్ణ! 106

తా. పువ్వు, పండు, నిప్పు, పొగ, మబ్బు, వర్షమువచ్చుట మృత్యువును తెల్పు అరిష్ట సూచనలు.

—♦ వైద్యుని యరిష్టజ్ఞానము. ♦—

క. మరణోన్ముఖుఁడగు రోగికి
నరిష్టములు దెలిసికొనక యౌషధమిడినన్
బరిహాసమగును గనుకా
యరిష్టములు వైద్యుఁ డెఱుఁగనగు; నిల గృష్ణా! 107

తా. చావుదగ్గర బడిన రోగియొక్క అరిష్టముల నెఱుగకుండ మందిచ్చిన పరిహాసమగును; కనుక వైద్యుఁ డెఱుంగవలెను.

—♦ అరిష్ట శాంతి. ♦—

గీ. పృథివిలో నరిష్టములు గాన్పించురోగి
బ్రదుకఁడైన మందిడుచు జపముడపంబు

బ్రాహ్మణులచేతఁ జేయించ ఫలముకానొ
కప్పు డాదవునని యె శివుఁడవనిఁ గృష్ణ! 108

తా. అరిష్టములఁ తోఁచు రోగి బ్రదుకఁడని ఆశ వదలుకొనవలెను. ఐనను మందులిచ్చుచు బ్రాహ్మణులచేత జపము తపము చేయించిన ఒకప్పుడు బ్రదుకవచ్చునని శివుఁడు చెప్పెను.

—♦ కృష్ణకాలపురుష ఫలము. ♦—

గీ. ఆకసంబునఁ గనుపించునట్టి నీడ
మహినలుపు దోఁచెనేనియా మనుజుఁడారు
మాసములలోన యమరాణ్ణివాసమునకు
నరుగ యత్నంబుసేయుఁ దానాత్మ; కృష్ణ! 110

తా. సులభము.

—♦ పీతనీలాది వర్ణ ఫలము. ♦—

ఆ. ఛాయ పీతవర్ణమై యున్నవ్యాధియు
నలుపు నెఱుపునైనఁ గలుగుహత్య
చిత్రవర్ణమైనఁ జిత్తమ్మునకుమహా
భయముగలుగు; నందువలన కృష్ణ! 111

తా. ఆకాశమందలి తననీడ, పసుపుపచ్చగా నుండిన రోగము, రంగురంగులుగా నున్న మనసునకు భయమును కలుగును.

—♦ అంగహీన కాలపురుషుని ఫలము. ♦—

క. ధరఛాయా పురుషుని పద
మరయఁగ విఱిగినటులున్న నార్నెలలకుఁ బం
ధురగుల్ఫములట్లగుచో
మఱి వత్సరమునకు గల్గు మరణము కృష్ణ! 112

తా. ఛాయాపురుషుని కాలు విరిగినట్లున్న ఆరునెలలకును గుల్ఫములవలె నున్నచో సంవత్సరమునకును, మృతికల్గును.

గీ. పరికించిచూడ ఛాయా
పురుషుని హృదయంబు నష్టమునుఁ బొందిన వ
త్సరయుగమున కాయువ్వము

పరిపూర్ణాణాంబవునటంచుఁ బల్కిరి; కృష్ణ! 113

తా. ఛాయాపురుషుని హృదయము కనఁబడక పోయినచో 2 సంవత్సరములకు మరణించును.

గీ. ధరణీతలమున ఛాయా

పురుషుని గుడిచేయి విరిగిపోయినఁ జుట్టాల్

మరణింతు రెడమచేయటు

విరిగినభార్యయు నశించు వెటన కృష్ణ! 114

తా. సులభము

క. అరయగ ఛాయాపురుషుని

శిరమును దక్షిణకరంబు శిథిలమయిన నా

పురుషుఁడు కొలదిదినంబుల

మరణము నొందంగఁగలఁడు మహిలోఁ గృష్ణ! 115

తా. ఛాయాపురుషుని తలయుకుడిచేయియు నాశనమైన యెడల అట్టివాడు కొద్దిరోజులలో మరణించును.

క. శిరహీనమైన నెల కం

ధరహీనంబైనచో దినము లెన్మిది జం

ఘరహితమైన దినము మేన్

మరుగు పడిన నపుడుగల్గు మరణము కృష్ణా! 116

తాత్ప:—తలలేని యెడల నెలలోను, మెడలేని యెడల ఎనిమిదిరోజులలోను, తొడలేని యెడల రోజులోను శరీరమేకనఁబడనిచో వెంటనే మరణము గల్గును.

—♦ ఛాయాపురుషలక్షణము. ♦—

క. ఛాయాపురుషుని లక్షణ

మీయిలలో దెలిసి కొనిన నెవరైనను బ్ర

జ్ఞాయుత కాలత్రయవిదు

లై యశమున్ గాంచఁ గలరిహమ్మునఁ గృష్ణా! 117

తాత్ప:—ఛాయాపురుషలక్షణ మెరిగిన వారు త్రికాలవేదులై కీర్తిగాంచఁ గలరు,

క. దూరస్థుఁడైన నరుఁడే
కారణమునఁ దెలియఁగలఁడొ కాలమ్మును నా
కారణము శివుఁడు చెప్పిన
తీరుగ వచియింతు జనులు తెలియఁగ కృష్ణా! 119

తాత్ప—దూరమున నున్న మనుష్యుడే హేతువుచే కాలము నెఱుగ గలఁడో ఆకారణమును మనుష్యులు తెలిసికొనుటకై శివుడు చెప్పిన రీతిగానే, చెప్పెదను.

—♦ ఏకాంత ఛాయాసాధనము ♦—

గీ॥ నిర్జన స్థలమ్మున కేగి నిలచి సూర్యు
నకు వెనుకఁ దిర్గి ఛాయఁ గంఠస్థలమునఁ
జూచి యాకసమందు సంకోచముడిగి
కనుఁగొనిన శివుఁ డగుపడుఁగాదె! కృష్ణా! 118

తాత్ప—ఒంటరిచోటికిఁబోయి నిలువఁబడి సూర్యునకు వెనుకతిరిగి నిలువఁబడి నీడయొక్క కంఠప్రదేశమున జూచి క్రమముగా ఆకాశమునకు అనుమానము లేక చూచిన కాన్పించును.

గీ. ఎలమి "ఓం హ్రీం పరబ్రహ్మణేనమో"య
టన్న మంత్రంబు నాత్మలో నధికభక్తి
నూట యెనిమిది సారు లనూనముగ జ
పింపనిష్టార్థమపుడ లభించుఁ గృష్ణ! 120

తాత్ప— "ఓం హ్రీం పరబ్రహ్మణేనమో" అను మంత్రమును 108 సారులు జపింప ఇష్టార్థము అప్పుడే చేకూరగలదు.

క॥ పరిశుద్ధస్ఫటికాకృతిఁ
బగఁగుచు వివిధాకృతుల విభాసిల్లెడు శం
కరుఁగన్న వాఁడు జీవుల
కరయఁగ దావిభుఁడగును నయమ్మునఁ గృష్ణా! 121

తా—తెల్లని స్ఫటికాకారముతో నొప్పుచు వివిధాకృతులు గల విగ్రహము కనఁబడినవాఁడు లోకపాలకుఁడగును.

—| రెండు సంవత్సరములలోఁ ద్రికాలజ్ఞుఁడగుట |—

గీ. ఇట్లు రెండు వత్సరముల నేకదీక్ష
ననుదినంబును యోగాభ్యాస మొనర్చు
మనుజుఁడిల సర్వశక్తి సంపన్నుఁడగుచు
నెఱుఁగుఁ గాలత్రియమ్ముఁ దానెలమిఁ గృష్ణ! 122

తా—ఈవిధముగా రెండేండ్లు ఏకదీక్షగా ప్రతిరోజును యోగాభ్యాసము చేసినవాఁడు సర్వశక్తిసంపన్నుఁడై త్రికాలముల నెఱుగును

—| నిరంతర యోగాభ్యాసఫలము |—

క॥ అనయము యోగాభ్యాసం
బును నిశ్చల చిత్తమూని పొనరించిననా
మనుజునకు దుర్లభంబిలఁ
గనరాదని చాటిచెప్పగాదగు గృష్ణ! 123

తా—ఎల్లప్పుడును ఇట్లు యోగాభ్యాసమును నిశ్చలచిత్తమును బూని చేసినచో మనుష్యునకు చేతగానిది లేదు.

క॥ దేవా! భూతనిచయ సను। భావానిర్మలతర ప్రభావా! శ్రిత సం
జీవా! పూజితపదరా। జీవా! నీ సేవ నెపుడు చేసెదఁ గృష్ణ! 124

—| వి జ్ఞ ప్తి |—

క॥ శ్రీకృష్ణుని కృపచే నాం
ధ్రీకరణముఁ జేసినాఁడ ధీనజనులను కం
పాకలితులై సహింపుం
డీ కాలజ్ఞానమునుఁ బరీక్షించి మదిన్ 125

గద్య.

ఇది శ్రీకృష్ణ గురు వరప్రసాద సమాసాదిత కవితా
ధారేయ సకల సుజనవిధేయ దేవినేని సూరయ
నామధేయ ప్రణీతంబైన వైద్యరహస్య
దీపికయను నామాంతరముగల
సత్యాత్రయ కాలజ్ఞానము
సంపూర్ణము.